# మహాభారతము

## శల్యపర్వము

( తిక్కనసోమయాజి ప్రణీతము )

ఆంధ్ర గ్రంథమండలి
తెనాలి

# విషయసూచిక.

## శల్యపర్వము.

# మహాభారతము

## శల్యపర్వము

### ప్రథమాశ్వాసము.

శ్రీగిరిజాసమవాయము
హాగురుతరశుభగసంపదాలంబ సదా
యోగిజనక్షేమసమా
యోగర్భితదివ్యచిత్త హరిహరనాథా. ౧

దేవా జనమేజయ ధా
త్రీవల్లభుఁ డుత్సుకత్వరేఖాసౌమ్య
శ్రీవిలసితుఁడై యిట్లనుఁ
డా వైశంపాయనున కుదాత్తవినీతిన్. ౨

దురమున నమ్మెయిఁ గర్ణుఁడు
పరిమార్పంబడిన నల్పపరిజనుఁడై య
క్కురుపతి యజయ్యుఁ డగు
నయ్యరులయెడం బిదప నెట్టు లయ్యె మునీంద్రా. 3

ఏను మును విన్నయకౌరవేంద్ర పాండు
విభుతనూజుల చరితంబు వేడ్కఁ బెంచెఁ

జెవులతియ్యంబు దళుకొత్తఁ జెప్పు మనఘ
వారి దైన్యయసంతరవర్తనంబు.

అని యడిగిన వైశంపాయనుం డమ్మహీనాయకున కిట్లని నట్లు కర్ణుండు వెగ్గిన దుర్యోధనుండు హతావశిష్టవసుధావరు పరివేష్టింపఁ గొంచెపుమూఁకలతోడ విడిదలకుం జని సుహ జ్జనంబులు దేర్ప విషాదం బుడిగి సముత్సాహ దోర్లీలయై శల్యునిం దనకు సేనాపతిం గావించి వేగుటయు బల బొలుపున వెలయఁ బోరికలనికి నడచెఁ బాండవేయులు బలంబుతోడం బన్ని యేతెంచిన నయ్యిరువాఁగునకు సు సురసమరంబునుం బోనిసంగ్రామంబయ్యె నంత మధ్యాహ్న బున నమ్మద్రపతి యుధిష్ఠిరుపరాక్రమంబునం దెగియెఁ బ పడి భటులుం జెలులుఁ జుట్టంబులును సమసిన నుక్కు ద యుక్కుఱువిభుం డనిపని సాలించి వెఱఁ బొందెడుచోఁ బుత్తో నొక్కరుండు దొలంగం బాఱి యొక్కమడుగు సొ దాఁగ యుండె నట గెలుపునుబ్బునం బొంపిరి వోవుపా వేయు లతం డం దునికి యెఱింగి యయ్యెడకు నరిగి నలి చుట్టుముట్టి పిలిచిన వెడలి పదముడితోడి పెనంకువం బెద్ద ప్రొద్దు పెనంగి యాభూనాథుండును బ్రొద్దు సాల వాలినప భీముగదాఘాతంబునఁ దొడలు విఱిగి పడియె నంత నిశా యంబున నశ్వత్థామ కృపకృతవర్మలు చనుదెందోమగా

నందనస్కంధావారంబుఁ గొదివి పాంచాలప్రభద్రికమాత్స్య ప్రభృతిశేషసైన్యంబుల సమయించె మఱునాఁడు సంజయుఁడు కురుక్షేత్రంబునం దుండి పూర్వాహ్ణంబునఁ గరినగరంబున కరుగుదెంచి.

పొరిఁబొరి మోము వొప్పుజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁ
డై । చరణయుగంబు దొట్రుపడ సంభృతశోకత రాజవీథి నె
వ్వరిఁ గని దైన్యమైన హామహీతలవైభవ హాధృతరాష్ట్రపుత్ర హా
కరిపురనాథ యంచుఁ జెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్. ౬

జననయనచకోరానం
దనుఁ డగు నృపచంద్రుఁ డనుచితం బయినవిధం
బున నస్తమించె నంచుం
దనుఁడోలనభరితభూరిదైన్యుం డగుచున్. ౭

చని ధృతరాష్ట్రమందిరంబు ప్రవేశించి లోపలికొలువున గాంధారియుం గోడండ్రును విదురుండును మఱియును దగుచుట్టంబులునుం బరివేష్టింపఁ గర్ణలేమికిఁ బ్రేముడించుపలుకులు నెల్లనుల్లంబు దురపిల్ల నున్నయన్నరనాథుం గని డగ్గుత్తిక వెట్టుచుఁ దనపేరు సెప్పికొని చేరి పాదప్రణామం బాచరించి యేడ్పు బెరయు నెలుంగుతో నిట్లనియె.

జననాథ శల్యుండు సమసె సౌబలుఁడు గీ
టడఁగె నులూకుండు మడిసె సకల
సంశ ప్తకులు గడచనిరి కాంభోజ శ
తానీకములు దెగటాఱె యవన
పార్వతీయమ్లేచ్ఛబలములు ద్రుంగె నల్
దిక్కుల మన్నీలుఁ దక్కఁగలుగు
నరనాయకులును జచ్చిరి కుమారులు గల
యందఱుఁ దెగిరి కర్ణాత్మజులును
బొలిసి రయ్యె వృకోదరుపలుకు దప్ప
కుండఁ దద్గదాదండప్రచండనిహతి
రెండుదొడలును విఱిగి ధరిత్రిఁ బెలుచఁ
గూలిరూపఱె రారాజు ధూళి గ్రుంగె. ౯

మఱియు ధృష్టద్యుమ్నుండును శిఖండియు నుత్తమౌజుండును యుధామన్యుండును లోనుగాఁ గలపాంచాలురును జేదిమాత్స్యప్రభద్రకప్రభృతిబలంబులు లోనుగా నవశిష్టజనంబులును నీమనుమలైన ప్రతివింధ్యాదిద్రౌపదేయులును సకలరథసామజఘోటకసుభటసమేతంబుగా మృతిఁ బొంది రిట్లు కౌరవశిబిరంబును బాండవస్కంధావారంబును విధివశంబున వనితావశేషంబు లయ్యె నిందుఁ గృపకృతవర్మలు నశ్వత్థామయుఁగా మువ్వురును నందుఁ బాండవులేవురును గృష్ణసాత్యకు

లుగా నేడ్వురును భవత్సుతుం డయినయుయుత్సుండును శేషించి రివ్విధంబునఁ బడునొకండు నేడక్షౌహిణులు నఖిల క్షోణికి దుర్యోధనునధిపుఁ గావింపనుం జంపనుం బూని కాలం బగుటయు నాలంబున నిశ్శేషత్వంబు నొందె నని చెప్పుటయు నమ్మహీపతి మూర్ఛిల్లె విదురుండును వివశుం డై యొఱగె గాంధారియుఁ గోడండ్రును జెయ్యేది పుడమిం బడిరి తక్కటి చుట్టంబులు మొగంబులు మొగుడం జిత్రరూపంబు చందం బైరి సంజయప్రయత్నంబున నందఱుం గ్రమంబునం దేఱి రప్పుడు మేను వడంక నమ్మానవనాథుండు నలుదిక్కులకు మొగంబు ద్రిప్పి విదురు నుద్దేశించి పుత్రహీనుండ ననాథుం డనగుట యెఱింగితే దమ్ముండ యిటమీఁద నీవ నాకు గతి యగు మనుచు మగుడ నిడుగుమూర్ఛాతిశయంబునం బరవ శుం డయిన నతండును నారీజనంబును శీతాంబుసేచనంబులను లలితవ్యజనవీజనంబులను గొండొకసేపునకు సేదదేర్చినం గూ ర్చుండి యక్కురువిభుండు గుంభనిక్షిప్తభుజంగంబుచందంబున నిశ్వాసంబు నిగుడ్చుచు నూర కున్నం గనుంగొని యశ్రాం తాసముదయంబును సంజయుండును రోదనంబు సేసిరి పదం పడి యవ్విచిత్రవీర్యనందనుండు. ౧౦

అనఘ వశము గాదు మనసు గోడండ్ర మీఁ
వదినెఁ జుట్టములను సదనములకుఁ

బుచ్చు మనియెఁ బలుకు లచ్చుపాటడఁచుగ
ద్గదిక దైన్యమెసఁగ విదురుతోడ. ౧౧

అనుటయు నాతం డందఱ
కును మెలవునఁ జెప్ప వగలఁ గుందుచు నల్ల
ల్లన తమనిలయంబులకును
జనిరి మఱియు నేడ్చుచుండె సంజయుఁ డలఁతన్. ౧౨

అమ్మేదినీశ్వరుం డేది గతి యని దుఃఖాతిశయంబునఁ జేతులు
విదిర్చి యాసూతనందను దిక్కు మొగం బయి. ౧౩

చావరు నొవ్వరు పాండవు
లేవురు నని నీవు చెప్ప నివ్వలుకులు దుః
ఖావేశకరములై చే
తోవృత్తి దహింపఁ జొచ్చె దుర్భరభంగిన్. ౧౪

తనయు లని నందఱుం బడి
రనఁగా విని పెక్కువఱియ లై పోవక యి
ట్లునికి యురము వజ్రమయం
బని తలఁపఁగఁ దగుమదీయ మగుహృదయంబున్. ౧౫

కన్నులు చీకు లై సుతనికాయము బాలవిహారలీలలుం
జెన్నగుప్రాయ మొందె విలసిల్లు తెఱంగును జూడఁ గాన కి

ట్లున్నను బంధుకోటి సమయోచితలాలనఁ బల్కు పల్కులన్
విన్నవి వీను లిప్డు గొఱవిం దముఁ జూఁడినయట్ల పొక్కెడిన్.

అని దుర్యోధను నుద్దేశించి. ౧౭

ఇట రమ్ము నన్నుఁ గౌఁగిటఁ జేర్పు కొడుక మీ
యమ్మనూరార్వురావయ్య వృద్ధు
లగుమమ్ము విడుచుట దగునె యేగతిఁ బోవు
వారము సెప్పుము కౌరవేంద్ర
యంధత్వవికలుల నరయక యిట్లుపే
క్షించితి నామీఁదఁ గృపయుఁ బ్రియము
నెక్కడ వోయె భూమీశులు గొలువంగ
నుండు దీ వట్లొంటి నున్నవాఁడ

వధికబలదుర్నివారుండ వైననీకుఁ
బాండుపుత్రులచేత నప్పాటఁ జావు
వచ్చె నిచ్చలు భక్తిమై వచ్చి కొలిచి
గారవింప నిం కెవ్వరు గలరు నాకు. ౧౮

కయ్యంపుమాట పుట్టినయప్పుడు నీవునాతోడ. ౧౯

చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గల్గ నా
కీపాండుక్షితిపాలపుత్రు లెదు రిం దెవ్వాఁడు దృప్యద్భుజా

వ్యాపారుం డనిఁగర్ణుఁ డొక్కరుఁడు మాయంజేయు మద్బాణవి
ద్యాపారీణత గెల్తు నొక్కఁడన యే నయ్యేవురన్ బ్రేల్మిడిన్.

మున్ను చెప్పినవారు గా కెన్నఁ గలరు
సుమ్ము బాహ్లికభగదత్తసోమదత్త
శకునిభూరిశ్రవశ్శలశల్యసింధు
రాజవిందానువిందాదిరథికవరులు. ౨౧

ఏనును గర్ణుఁడుఁ దమ్ములు
నా నలువురు వీరు లైన నటు నూఁడు పృథా
సూనుల నెట్లు జయించెద
నో నమ్మము నాబలంబును గలితనంబున్. ౨౨

అని యాజడిల్లఁ బలికిన
విని భవదీయానివార్యవిక్రమమునఁ బాం
డునరేంద్రసుతులు డెగుదుర
యని తలఁచితి నీవె తెగితె యప్వీరులచేన్. ౨౩

అమరనదీతనయుఁడు సిం
హము గాక నరుండె పార్థుఁ డట్టిమహాత్మున్
సమయించె నట్లు జంబుక
సముని శిఖండిఁ గొని విధి కసాధ్యము గలదే. ౨౪

శరగురుఁ డట్టియోధుఁ డటె చచ్చె నసిన్ దొర గానివానిచే
వెరవున లావునన్ జనులు వెక్కస మందఁగఁ జేయుసింధుభూ
వరుఁ డటె రిత్త వోయె ననివార్యుల బాహ్లికసోమదత్తులం
బరు లవలీలఁ జంపి రటె పల్కుదు నేమని యేను దైవమున్.

నీనమ్మినభూరిశ్రవుఁ
డేనికలా వతఁడు నెందు నెన లేనిమగం
డైనభగదత్తుఁడును వ
మ్మైనతెఱంగట్టె యేమి యందుఁ గుమారా. ౨౬

నచ్చినకర్ణువిక్రమమునం బరవీరులయుం దొకండనుం
జచ్చుట లేదు దుర్దమము శల్యభుజావిభవంబు లోకముల్
మెచ్చినయట్టి దందు నొకమేలు వినంబడ దమ్మహాత్ములన్
ముచ్చిచ్చులఁ జంపినట్టులు పరుల్ దెగటార్చిరి దైవ మిచ్చినన్.

కొడుక తమ్ములుదోడ్పడఁగడఁగి శత్రు
వరుల గెలిచెద నంటి వొక్కరుఁడుదక్క
ఖండ నీతమ్ముఁగుఱ్ఱల నూచముట్టు
గానియెనే విధి యేగతిఁ జనుదుఁ జెపుమ. ౨౭

కదిసి పవనజుఁడు బెట్టుగ
గద వ్రేసినఁ దొడలు విఱిగి కయ్యపునేలన్

మద మఱి పడినప్పుడు నీ
మది నే మని తలఁచితో కుమార యెఱుంగన్. ౨౯

అని పెక్కుభంగుల విలపించి ౩౦

తలపఁగ భాగ్యవంతుల కుదాత్తశుభం బగుఁ గాక పుణ్యహీ
నుల కది గల్గ నేర్చునె తనూభవు లాఱడిఁ బోయి రింకఁ గా
నలఁ జరియింపఁ బోవుటయు నా కుచితం బటు గాక చండినై
నిలిచితి నేని మాటలనె నిచ్చలు భీముఁడు చూచు చుండఁడే.

విను దుర్యోధనదుశ్శా
సనులఁ బలికి పలికి నిచ్చ చావుగ నప్పా
వని యలఁచుఁ గాన నడవికిఁ
జనుటయ మే లైన తెఱఁగు సంజయ నాకున్. ౩౨

అని పలికి యత్యంతదుఃఖదూషితస్వాంతుం డగుచు నమ్మహీ
కాంతుండు నిట్టూర్పు నిగిడించి యాసూతనందనున కిట్లనియె.

సురసరిదాత్మజుఁడును శర
గురుఁడును గర్ణుండుఁ దెగుటకుం దలఁకక యె
వ్వారిబాహుబలము గొని యే
మరి కోల్తల సేసి రొక్కొ మనవా రనికిన్. ౩౪

అని తనకొడుకుచలం బూహించి. ౩౫

మును విదురుండు సెప్పె నతిమూర్ఖమనోగతి యైనయీసుయో
ధనుచరితంబు గీడఖిలధాత్రిజనంబులకుం బొసఁగ్చు నా
శన మని దానిఁ గొందఱవిచారులు పాటిగఁ బట్టరైరి నా
కును మది వారికెల్లటుల కుత్సిత మయ్యె విధాతృస్ఫునన్.

అప్పు డటు లతఁడు సెప్పఁగఁ
దప్పఁ దలంచినఫలంబు గగఁ గుడువక పోఁ
జొప్పడునె సూతనందన
చెప్పు మనికి నెవ్వఁ డమరు సేనాపతి యై. ౩౬

దురమున నర్జునప్రకటదోర్విభవంబు నెదుర్పఁ జాలును
ద్ధురుఁ డొకరుండు గల్గెనె విధూతవిరోధిబలుండు శల్యుఁడే
వ్వరిభుజశక్తిఁ జిక్కెఁ గురువర్గము సంక్షయము మట్లు సెల్ల దు
స్తరబలభాసిభీమునిగదం బడియెం గురుముఖ్యుఁ డెమ్మెయుంగా.

కృపకృతవర్మాశ్వత్థామ లెబ్బంగి బ్రతికిరి ధృష్టద్యుమ్నశిఖండి
ప్రముఖపాంచాలురును జేదిమాత్స్యప్రభద్రకప్రభృతిబలంబు
లును నామనుమ లైనప్రతివింధ్యాదిద్రౌపదేయులును దక్కు
నుం గలుగుయోధవీరులు నెవ్విధంబున మృతిఁ బొందిరి పాం
డవు లేవురును బద్మనాభసాత్యకులును యుయుత్సుండును

నెత్తెఱుఁగునఁ దెగటారక తప్పి రింతయుఁ బరిపాటిఁ దేటపడఁ
జెప్పు మనిన విని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె. ౩౯

సూతసుతుండుఁ జేయుఁ గలశూరులు దర్పసమగ్రభూపతి
వ్రాతముఁ బెక్కుదంతిరథవాజిభటావలులున్ భుజాబల
స్ఫీతులు పాండునందనులచేఁ దెగటారిన నోడి వీటికిన్
నీతనయుండు హీనరథినీయుతుఁడై యటు లేఁగి నెవ్వగన్.

—◆ కృపాచార్యుఁడు దుర్యోధనునకు హితోపదేశంబు చేయుట. ◆—

మందిరంబుఁ బ్రవేశింపక యొక్కబయల నిఖిలబంధుమిత్ర
పరిజనపరివృతుండై నిలిచె నయ్యవసరంబునఁ గృపార్ద్రచిత్తుం
డై కృపాచార్యుం డన్నరేంద్రున కిట్లనియె. ౪౧

సమరమున మిమ్ముబోంట్లకు ను
త్తమధర్మం బిదియ తొంటిధాత్రీశులు కృ
త్యముగఁ గొని యాచరించిరి
తమకు సుగతి గోరి కీర్తిస్ఫురణమెయిన్. ౪౨

ఐనను నొకపలుకడ్డము
గా నొడివెద దాని లెస్సగా విని యది మే
లైనను జేసెదు గాదే
న్మానెద నేర్పడఁగ వినుము మనుజాధీశా. ౪౩

అమరనదీతనూభవుఁడు నస్త్రగురుండును గర్ణుఁడుం బరా
క్రమమహనీయు లాహవధురంధరు లట్టిర తక్కఁ గల్గుభూ
రమణులు బంధుమిత్రులు దురంబున నందఱఁ బాండునందనుల్
సమయఁగఁ జేసి రట్లు భుజశక్తియు దైవబలంబు నెక్కుడై.

వెరవును లావునుం గలుగువీరులు పోరులఁ బడ్డ హీనతం
బొరసితి మస్త్రశస్త్రహతి భూవర చిక్కినవారు నొల్లఁ బో
యిరి విను పాండురాజసుతు లెవ్వరు గంటికి రెప్పచందమై
హరి తముఁ గావఁ గా వెలసి రక్షతదేహవిలాససంపదన్. ౪౫

శ్వేతాశ్వపాటవం బు
ద్ద్యోతిత మై మెఱయఁగాఁ జతుర్దంతరుచి
స్ఫీత మగుగజముక్రియ నరుఁ
డాతతకురుసైన్యసరసియందుఁ జరించున్. ౪౬

జ్యారవము నాదముగ నతి
ఘోరత వైరు లనుశరటికోటికి రయదు
ర్వారం బగునర్జునకం
ఠీరవము శితాస్త్ర నఖపటిష్ఠతఁ జూపున్ ౪౭

అర్జునోదగ్రగదవశిఖ హరిమహాని
లంబు ప్రేరేప వైరిబలప్రకీర్ణ

గహనదహనవిహార ముగ్రముగఁ జలుపఁ
దేఱిచూడను రామన్కి_ దెల్ల మధిప. ౪౮

ద్రోణుఁడు సూతనందనుఁడు ద్రోణతనూజుఁడు నేను శల్యుఁడుం
దాక్షిణపరాయణత్వమున దర్పము సూపఁగ నీవుఁ దమ్ములున్
బాణపరంపరల్ గురియ ఫల్గునుఁ దందఱ మీఱి సైంధవ
ప్రాణము నాచికోలు నరపాల తలంపఁగ మర్త్యకృత్యమే. ౪౯

ఇంతకమున్న సెల్లెఁ బదియేడుదినంబులసంగరం బతి
శాంతతఁ గుంది రిందుఁ గలసైనికు లద్దెసఁ గల్గుయోధు లా
క్రాంతవిరోధిదర్పుఁడు పురందరనందను బల్మికల్మి ని
శ్చింతత నుల్లసిల్లెదరు చెక్కు_ చెమర్పక కౌరవేశ్వరా. ౫౦

బలవిక్రమఘను లగుదోర
లిలిగిన మనసేన మేదినీశ్వర విను క
న్నులు సెడిన ట్లున్నది యీ
కొలఁదిం బోరిగొనుట నరునకున్ సుకర ముగుఁడ. ౫౧

అని చెప్పి కృపవర్మశల్యగురుపుత్రులను దన్ను నెన్ని. ౫౨

దామోదరుతమ్ముఁడును
భీముఁడు నిరుగెలఁకులందుఁ బేర్చి తఱుమ ను
ద్దామగతి నడరుకవ్వడి
కే మింతయుఁ దలపఁ నొక్కయొత్తు కుమారా. ౫౩

అనిలసుతుండు పూన్కి బలుపారఁగఁ గొండొక దీర్చె నేపునాం
దినభుజసంపదం గొలఁత దీర్పఁగ నింకఁ గడంగ కుండునే
మనకు నజాతశత్రునిసముంచితమార్దవ మూఁది సంధి సే
య నుచిత మైనకాలమిది యాగ్రహముం జొరనీకు చిత్తమున్.

సమరము నిష్కారణమై
రమునం బాటిల్లె నెల్లరాజులు భరతో
త్తములును మడిసిరి విడు కో
పము దీర్ఘక్రోధుఁ డై నపతి కీడొందున్. ౫౫

తమకు బలం బెక్కినతఱి
సముచిత మగు విగ్రహంబు శత్రుల కుత్సా
హము మీఱినపుడు గర్త
వ్యము సంధి యనంగ విందు మార్యులచేతన్. ౫౬

కలవా రెల్లను దెగి నీ
తలన నిలిచెఁ గార్య మధిప తగ నొడఁబడు మి
ట్టల మగునాత్మవినాశము
కలుగుట యది విపులపాతకం బండ్రు బుధుల్. ౫౭

తనకై కాదేమది నె
ల్లను గోరుట వినుము దాఁ బ్రబలయ మొందెనయే

నిని వారనియుద్యోగం
బునకు ఫలం బేమి రాజపుంగవ చెపుమా. ౫౮

నినుఁ గాచికొనుము నీ వు
న్నను సర్వము గల్గుధర్మనందనునిఁ దగం
గను మతఁడు రాజ నని తన
మనమున నెక్కించుకొనఁడు మదగర్వంబుల్. ౫౯

రాజ్యభాగంబు దగ ధృతరాష్ట్రునకును
నీకు నన్నదమ్ములకు నానృపతియొసఁగు
నాతఁడెపుడుశుశ్రూష సేయంగఁగోరు
గురుజనములకుఁ గావఁ గూడు టొప్పు. ౬౦

హరియును గా దనఁడు గరుణాన్వితు లై లగ నమ్మహాత్ము లె
వ్వరుసునఁ గార్యనిశ్చయము వల్కినఁ గీచకవైరియుం బురం
దరతనయుండునుం గవలు దానికి మా ర్పలుకంగ నెమ్మెయుం
జొరరగుసంధియెట్లునననూయత నూల్కొనిచేయుమి త్తఱిన్.

ఇంత చెప్పు టనికి నే నోడి ప్రాణర
క్షణము సేసికొనుట గాదు నీకుఁ
బథ్య మనియుఁ దఱిమి పల్కితి విను.
వినవేని నొచ్చి తలఁచె దిట్టు లగుట. ౬౧

అని యగ్గౌతముండు శోకాయత్తచిత్తుం డగుచుం దనకు హితోపదేశంబు సేసిన విని దుర్యోధనుండు వేఁడినిట్టూర్పు నిగిడించి యొక్కింతసేపు చింతాక్రాంతుండై యూరకుండి వ్రాల్చినకనుదోయి విచ్చి యవ్విప్రవరు మొగంబుసూచి యిట్లనియె. ౬౩

చెడుటకు నోర్వ కీ విటులు చెప్పితి నాకు హితంబు నెయ్య మె
క్కుడు గలయట్టిచుట్టమునకున్ నయశిక్ష దగుం గదా భరం
బడి బవరంబులం బెనఁగుభంగిని గార్యము దెల్పఁ జాలిన
ప్పుడు నిను రక్షణార్థి వని భూసురసత్తమ యే నెఱుంగుదున్.

నీకూర్మిపేర్మిం జేసి కీడు దొలఁగింపం జూచి సంధి కర్తవ్యం బని పలికితివి గాని యప్పలుకులు నాకు రుచియింప వెట్లంటేని.

కపటంపుజూదంబు ఘటియించి రాజ్యంబు
గొని ధర్మజునిమది గుందఁ జేసి
సభ కేకవస్త్ర రజస్వల నమ్మెయిఁ
బాంచాలి ముందల వట్టి యీడ్చి
సంధి సేయఁగఁ బూని శౌరి యేతెంచిన
నవ్విధంబున కప్రియం బొనర్చి
పలువురు గూడి సౌభద్రు నొక్కని బాలుఁ
గట్టి యుత్తెఱఁగునఁ గీ టడంచి

నేఁడు దుశ్శాసనునియురమ్ము నెత్తు రనిల
సుతుఁడు మదనమునఁ ద్రావుట సూచి కొఱఁత
ప్రతిన దీర్చు నతం డని భయము బొంది
పొందు గోరిన నది యేల పొసఁగుఁ జెపుమ. ౬౭

రాజులు భక్తిఁ గొల్వఁగ ధరావలయం బఖిలంబు దర్పవి
భ్రాజితవృత్తి నేలి యనురక్తులఁ బ్రోచుచు శత్రుకోటికి
న్దేజము దప్పఁ జేయుచు నతిప్రమదంబున నున్న నాకు నిం
కాజియె కాక యొక్కనిదయం గనురాజ్యసుఖంబు లేటికిన్.

నిశ్చయం బెట్టిద యగుటం జేసి. ౯౮

పాటుతు నెట్లు పాండుపుత్రులతోఁ గయ్య
మేను నీవు దీని కియ్యకొనుము
పలుకు వినమి గాఁగఁ దలఁపకు ముచితంబు
తెలుఁగు ధీరజనుల కెఱుఁగ రాదె. ౬౯

విభవమునుం బ్రతాపమును విశ్రుతకీర్తియు మాయ ధర్మపు
త్రభటసమానవృత్తమున దైన్యము నొందుట కోర్వరాదు వి
తభయతఁ బోరఁ బేర్కొని యుదాత్తపదంబున కేఁగి భీష్మకుం
భభవజయద్రథాదు లగు బాంధుల మిత్రులఁ గూడుటొప్పగున్.

అంత వలవ దిమ్మాట మగపాడి కాడితిం గాని. ౭౧

ఏను దెంపు చేసి యీయున్నరథికజ
నంబుతోడఁ గడఁగి నడవ బెట్టు

దలిమి పాండురాజుతనయుల మర్దితు
ననఘ నీవు మెచ్చునట్లు గాఁగ. ౭౨

అన విని చుట్టు నున్ననృపు లందఱు సంతస మంది యున్న శేం
ద్రుని వినుతించి యోటమికి రోయుట నొందినచింత వంత యె
ల్లను దిగఁద్రోచి నెమ్మనములన్ రణకౌతుక మావహిల్లునా
ననములు దోఁప దర్పవచనంబుల సేనకు నుబ్బొనర్చుచున్.

—◆ దుర్యోధనుఁడు శిబిరంబు విడిచి సరస్వతీతీరంబు చేరుట. ◆—

చెలంగి కృపకృతవర్మాశ్వత్థామశకునిశల్యులు గార్యంబు విచా
రించి కౌరవేశ్వరు నాలోకించి మన మీరాత్రి శిబిరంబున
నిద్రించుట యొప్ప దెట్లనినఁ గర్ణుం దెగటార్చుటం జేసి పేర్చిన
యుబ్బునఁ బాండవులు పైకొని పరాక్రమింప నప్పళింపఁ
గలుగుఁ బో యని తలంచెదము వినుము వంచనఁ దొలంగి
యుండి మనకుం గలచతురంగంబుల నాయితంబు సేసికొని
పెనఁకువం బన్ని వారికి వెఱఁ గగునట్టిచెట్టిదంపుటురవడిం
గదిసి రణంబు సేయుద మట్లైన జయంబు గొనవచ్చు నని
చెప్పిన నవ్వసుమతీపతి ప్రీతుండై యరి లెస్స వెర వట్ల
చేయుద మని సముచితభంగిం దగువారల కెఱింగించి కదలి
యచటికి రెండామడ యగుసరస్వతీప్రాంతం బయలికి బలం
బులం గొని చని సకలజనవాహనసహితంబుగా నమ్మహా

నదియం దిచ్ఛానురూపస్నానపానంబు లాచరించి వలయు తెఱంగున వెనుక నడతెంచిన వివిధాహారంబులం దుష్టిం బొంది యిష్టాలాపంబులు సెల్లుచుండ నున్నసమయంబు మున్నాకర్ణంబు నడపినదారలును జిత్రసేనాదిభవత్కుమారులును గర్ణు కొడుకు సత్యసేనుండును లోనైనయాప్తజనంబు లమ్మనుజ నాథున కి ట్లనిరి. ౭౪

పెరవును లావునుం గలిగి విక్రమసంపద సొంపుమీఱి భూ
వర భవదీయు మైనబలవర్గము నొడ్డన మేర్ప వీఁకమైఁ
బురికొలుపంగ నిర్భయతఁ బోలెడునట్లుగఁ దాను ముందరై
తిరముగఁ జేయఁ జాలు నొకధీరు నొనర్పుము సైన్యనాథుఁగన్.

అనిన విని వృషస్కంధుండును బీనదీర్ఘభుజార్గళుండును భర్గవరలబ్ధజన్ముండును దివ్యాస్త్రవేదియు నవ్యాహతవిక్రమోద్దాముండును నగు నశ్వత్థామ నాలోకించి యాదరభరితుం డగుమ నాధరణీవరుం డతని కి ట్లనియె. ౭౬

అనఘ నీవు నాకు నాచార్యవట్టుల
నేడుగడయుఁ గాన హితము సెప్పఁ
దగు బలాధినాథుఁడుగఁ జేయ నర్హుని
నెల్ల వినఁగ నిశ్చయింప వలయు. ౭౭

అనుటయు నాతఁ డిట్టు లను నజ్జనపాలున కాజినైపుణం
బును మహనీయశౌర్యమును భూరిబలంబును సర్వసత్త్వవే

ధనముఁ బరాక్రమోద్ధతియు ధైర్యసమగ్రతయుం గలండు శ
ల్యుని రథినీపతిత్వమహిమోజ్జ్వలుఁ జేయుము కౌరవేశ్వరా.

నినుఁబట్టి పాండుపుత్రులఁ
దనమేనల్లురఁ దొరంగె ధరణీశ్వర యీ
తనిఁ గడచినపరమహితులు
మనకుఁ గలరె యితఁడు లోకమాన్యుఁడు గాఁడే. ౪౯

కార్తికేయుం డధీశుఁడుగా నమర్త్య
లెలమిఁ బురికొని దైత్యుల గెలుచుకరణి
మద్రవిభుఁ డగ్రణిగ నేచి మనము నడచి
కడిఁదిపగఱ జయింతము కౌరవేంద్ర. ౫౦

అనిన విని సమస్తజగతీశులును జయజయశబ్దంబులతో శల్యుం బరివేష్టించి సంగరోత్సాహంబునం బొంగిరి కురునాథుండు గద్దియ డిగి సవినయంబున నమ్మద్రవిభున కభిముఖుండై యిట్లనియె. ౫౧

పొచ్చెము లేని నెయ్యమునఁ బూని విపద్దశ నొందకుండఁగా
నెచ్చెలిఁ గావఁ జూచుమహనీయున కెట్టిద తాల మిప్పు డీ
వచ్చుపడంగ నీభుజబలాతిశయంబున నద్భుతంపు గె
ల్పిచ్చి కృతార్థుఁ జేయు నను నేనినుఁ జెందియుఁ దూలఁబోదు నే.

పూనుము చమూపతిత్వము
నానమ్మినవారు నేను నరపతిబలసం

తానంబుత్రోడఁ బరిజన
మై నడచెద మాక్రమింపు మరివర్గంబున్. ౮౩

అన విని శల్యుఁ డి ట్లనియె నమ్మనుజేంద్రున కిష్టుఁ డింతప్రా
ర్థన మొనరింప నేల వసుధావర యే నినుఁ జేరినప్డ నా
ధనమును బ్రాణమున్ బలవితానము నీకు సమర్పణంబు సే
సినయది గావె నీవనువు సేసెదఁ గౌరవసేనఁ గాచెదన్. ౮౪

భుజవీర్యంబున నచ్యుతార్జునులు నం బోలంగ లే రల్క. వ
చ్చి జయింపంగఁ గడంగినన్ సురలు నా చే నొత్తు రే నేచి య
క్కజపుం జేవయు లావు జూపువడికిం గౌంతేయులే యోర్తు రా
ప్రజయున్ నీప్రజయుంగలంగఁ జెలఁగం బాటింతునాటోపమున్.

ఆటీముటీంబాణజాలముల నక్కడిసైనికులం దెరల్చెదన్
గుఱుకొని నాకు మాఱుకొని కోల్తలఁ జేసినవీరవర్గమున్
ఱేకెదఁ జూచుఖేచరగణంబుల కచ్చెరుపాటొనర్చెదన్
బఱపెదఁ బాండునందనులఁ బాఱక నిల్చిన ఘా పడంచెదన్.

గంగానందనుపోటు మెచ్చక గురుం గా దంచు రాధాతనూ
జుం గీడాడుచు నీతఁ డెవ్వఁ డొకొ యంచున్ శల్యుఁ డేయిట్టివా
నిం గయ్యంబుల మున్ను గానమనుచు న్వేభంగులం జూప ఆ
గీర్తింప ధనుఃకళానిపుణలీలాఖేలతం జూపెదన్. ౮౭

—: దుర్యోధనుఁడు శల్యుని సేనానాయకుంగాఁ జేయుట :—

అని పలికిన నీసుతుండు ప్రీతుండై కనకకలశంబుల సరస్వతీ జలంబులు దెప్పించి శాస్త్రోక్తప్రకారంబునఁ దగురాజులుం దానును సేనామధ్యంబున భద్రవిధానోపేతంబుగా నమ్మద్ర విభు నభిషేకించి బలాధిపత్యపట్టబంధంబు నిర్వర్తించిన శంఖ భేరీప్రముఖమంగళతూర్యరవంబులు సెలంగ సైనికసింహ నాదంబు లుల్లసిల్ల నప్పుడా శల్యు నుద్దేశించి దీవనలం బొగడ్తల నఖిలజనంబులును ముఖరు లయి రిట్లు సంతసిల్లి సపరివారం బుగాఁ గురుభూమీశ్వరుండు విశ్రామంబు నొందె నట్టియెడ మున్న సమరజయంబునం బ్రమోదభరితుం డగుచు నిజశిబి రంబునకుం జనినపాండవాగ్రజుండు బంధుమిత్రపరిజనంబులఁ దమతమవిడిదలకుం బోవం బనుపక యుచితప్రదేశంబునఁ జేరో లగం బుండి మనవారివలనివిశేషంబు లరయఁ జారులం బనిచిన వాఁడై వారలు మగిడి వచ్చునంతకు నేమేని వినోదంబులం బొద్దు పుచ్చి యక్కడియుత్సాహంబు లెఱుంగంతయు విని యచ్యుతునాననం బాలోకించి యి ట్లనియె. ౮౮

కురుపతి మద్రరాజుఁ దనకుం బలముఖ్యుసిఁగా నొనర్చి సం గరమున నుత్సహించె నధికప్రమదంబున వారిసేనయుం దిర మయి పేర్చియున్నయది దీనికి నెయ్యది సేయువార మీ వర యును కార్యవృత్తిహృదయంబునఁ బాండవరక్షణోత్సుకా.

నెట్లు నిశ్చయించి పలికె దట్ల చేయుదు ననిన నమ్మహీకాం
తునకు మద్రాంతకుం డి ట్లనియె. ౯౦

శల్యా నెఱుంగుదు శౌర్యధైర్యంబు ల
గ్గల మాతనికి బాహుబలఘనుండు
గాంగేయకుంభజకర్ణుల మిగిలెడుఁ
గాదేని సముఁ డగుఁ గాని యునదు
గాఁ దలంపగరాదు కౌరవపతి మాన్యుఁ
జేయుట నధికవిజృంభణంబుఁ
జూపు భీమునకు నర్జునునకు నెనయంగ
రాదు సాత్యకి కోర్వరాదు పార్ష
తునకుఁ దత్సోదరులను మార్కొని పెనంగి
బ్రతుకరాదు నీవీట నాబల్లిదునకు
నెదురురథికునిఁ గాన ననేకహేతి
నిపుణశార్దూలవిక్రమ నీవు దక్క. ౯౧

ఒరు లయినఁ బెక్కు దినములఁ
బొరిగొను నీబలము నెల్లఁ బొరివోవ నతం
డరిభంజన నీవైనం
బరహోత్సాహమున నెల్లి పడ వై తతనిన్. ౯౨

అతఁడు మేనమామ యన్నకృప దక్కను
జధర్మమును బురస్కరించి

యతులవిక్రమక్రియాపాటవంబున
నవ్విరోధినాము మడఁప వలయు.

గాంగేయుని గుంభజుఁ గ
ర్ణుం గడచితి మింక నుద్ధురుం డగుమద్రే
శుం గూల్చు మంతతోడఁ దె
గుం గురుపతిపని జయంబు గొనుము కడఁకన్. ౯౪

అనిన విని యుధిష్ఠిరుం డతని కి ట్లనియె. ౯౫

అనఘ నీవు చెప్పినట్టులు సేసెద
మున్న పలికినాఁడ నన్నరేంద్రు
కడిమి నాకుఁ బాలు గాఁ బూని యుద్యోగ
వేళయందు నెల్ల వినుచు నుండ. ౯౬

సదనంబునకుం జని సుఖనిద్ర సేయు మని పలికి పద్మనాభుని దనతమ్ములను ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకిప్రముఖులను దక్కటి పరిజనంబులను నిజమందిరంబులకుం బోవం బనిచి వీతశల్యం బైనమాతంగంబుచందంబున శయ్యాతలంబు సేరె బలం బంతయు నత్యంతసంతుష్టం బై విశ్రాంతి నొందె నారాత్రియే నిట వచ్చి నీకుఁ గర్ణువృత్తాంతంబు సెప్పి నీవు పనుప మగిడి చని తెలతెల వేగునప్పుడు కౌరవసేనాసన్నివేశంబు సేరితి నాసమయంబున. ౯౭

కురుపతి పడవాల్గం దగు
దొరలకడకు సత్వరముగ దురమునకు భటో

త్కారము నవఘ్వు సేయుటకై
బరవసము దలిర్పఁ బలిచెఁ బార్థివముఖ్యా. ౯౮

పనిచిన నెల్లవారు నల్లంబుల నుత్సాహంబు లుల్లసిల్లఁ దమ తమచతురంగంబులకు సవరణలు సంఘటింపం దొడంగినఁ దూర్యంబులు సెలంగ నొండొరులఁ బిలుచు నెలుంగులు నింగి ముట్ట రథనేమిగజపదతురంగఖురపుటభటచరణ సంఘట్టితం బగుధరణీతలం బద్రువ బహుళం బగుధూళి చంద్రోదయ సమయఘూర్ణమానం బగుమహార్ణవంబునినదంబు ననుకరించె నట్లయ్యంత బై శల్యశకునికృపకృతవర్మాశ్వత్థాములును దక్క నుం గలయోధవరులును నొక్కెడ ననుజసహితుం డై యున్న మనుజపతిసన్నిధిఁ గూడి యతండు వినఁ దమలో నిట్లనిరి. ౯౯

ఒకఁ డొకఁడ పాండవులఁ దాఁ
కక సైన్యోపేతగాఢగతి నందఱు నొ
క్కొకతల గాఁ దలపడి వా
రికడంక యుడుపఁగవలయుఁ గ్రీడయు పోలెన్. ౧౦౦

మన మొక్కొక్కళ్ళకుఁ బాఱి పగుచు నేపారి పోరినం, జుల్కన గెల్పుగొన వచ్చు నిత్తెఱంగు మనకు సమయంబు సుండీ యట్లు గాక యొంటి పెనంగెడి వాఁడును బెనఁగెడివానిఁ గని కూడుకొనినవాఁడును బంచవిధపాపంబుల నొందఁ గలవాఁ డని యొండొరులకుం జెప్పికొని కదలి యుద్ధామసామగ్ర్యంబున నమ్మద్రపతి ముంగలి యై నడవం జను నప్పుడు. ౧౦౧

—: కౌరవసైన్యంబు యుద్ధసన్నద్ధంబై వెడలుట :—

చంచరీకావళిఝంకృతుల్ గల్పించు
కర్ణఝుళంఝుళాకలనములును
ధరణీపరాగసంతానంబు గబళించు
కరశీకరచ్ఛటాస్ఫురణములును
ఘంటికాటంకృతికాంతి సంభావించు
నిర్భరబృంహితనిస్స్వనములు
నంబరభాగంబు నల్పంబు గావించు
నున్నతగాత్రసముద్ధతులును
జారుభీషణరేఖలు భూరిమదభ
రాభిరామయానంబులు నాహవోచి
తోగ్రకల్పనాభంగులు నుల్లసిల్లఁ
గరులు ధాత్రీతలంబు గ్రక్కదల నడచె. ౧౦౨

గతిబహుతాలసత్ఖురవిఘట్టితమేదిని జీవితేశక
ల్పితనఖరేఖలం జెలువుపెంపు వహించుపురంధ్రిఁ బోల నా
ద్ధతముఖబంధురాంగలలితంబులు నూర్జితకింకిణీఝణ
త్కృతిపటుహేషలుం దగ నుదీర్ణములై నడచెం దురంగముల్.

మీఁటినయుబ్బున మీఁదికిఁ గాఁపులు
సాఁచురథ్యంబుల చటులతయును
లలి బొల్లికిని బోఁవుచెలువున విలసిల్లు
సూతజనంబు విస్ఫూర్జితంబు

జతనంబు మేలిమిఁ జారుఘోరము లగు
నవయవంబుల విభవాతిశయము
బిరుదుల నుద్భటస్ఫురణంబు లై క్రాలు
కేతనంబుల సముద్ద్యోతితంబు
సొంపు మిగులంగ జోదుల యుంపపోదుల
దీప్తులును లేఁతనవ్వులదీధితులును
హారిరశ్ములఁ గీల్కొని నగుచు వెలుఁగఁ
దేరు లరిగె నుద్దామత గౌరవేంద్ర. ౧౦౪

కడఁకయు లావునుం గరఁగి గట్టిగఁ గూర్చి యొనర్చినట్టి పే
రొడళులఁ దాల్మియుం గడిమియుం గలయంబరికించి యందు నే
ర్పడుకొని గాఢభంగి రచియించినచందము నెమ్మనంబులం
గడుఁ జెలువొంద నుబ్బి వడిఁ గాల్బల మేఁగెఁ గదంబుదగ్రతన్.

ఇట్లు కురుబలంబు సమరతలంబు చేరం బోవునంతం బాండవ
బలంబును జనుదెంచె ననిన విని యాంబికేయుండు సంజ
యున కిట్లనియె. ౧౦౬

సురనదీసుతుచావును గురునిచావుఁ
గర్ణుచావును వినిననాకర్ణములకు
శల్యుచావు దుర్యోధనుచావుఁ జెప్పి
యధికతరముగ సంతోష మావహింపు. ౧౦౭

అమ్మహీవిభుని ధర్మజుఁ
డెమ్మెయిఁ బరిమార్చెఁ గౌరవేంద్రుని భీముం

డెబ్బయిఁ గీటడఁచె రణం
బెబ్బయిఁ బరిపాటిఁ జెల్లె నేర్పడఁ జెపుమా. ౧౦౮

అనుటయు సంజయుం డమ్మనుజపతికి ట్లను నగచుకొలంది
కడచనియె ధీరుండవై వార్త లవధరింపుము. ౧౦౯

గంగాసుతగురుకర్ణుల
సంగరమునఁ బాండుసుతులు సంపుట గన్నా
రం గనియు నీతనయు లా
సం గూరిరి వారిఁ జంపు శల్యుం డనుచున్. ౧౧౦

దుర్యోధనుండు దిక్కుమాలి యుండియు నడిగూసం జేసి
తన్ను సంపన్నునింగాఁ దలంచుచు ౧౧౧

అనుజులుఁ దాను శల్యునిఁ బ్రియాతిశయంబునఁ జేరఁ బోవ నా
యన మును కర్ణుఁ డర్జునశరాహతిఁ గూలిన నుబ్బి భీముఁ డా
ర్చిన నడ లొందు తల్లడిలుచిత్తము లూఱట నొంద వారలం
గనుఁగొని పల్కులన్ శ్రుతిసుఖంబొనరించె నుదగ్రమూర్తియై.

ఇట్లు సమరోత్సాహసమగ్రుం డయిన మద్రపతి సర్వతోభద్రవ్యూహంబు వన్నించె నందు ముఖంబున మద్రపతి కర్ణపుత్రప్రముఖపరివృతుండై తాను నిలిచె వలపట శకయవనసమేతుండై కృపాచార్యుండును దాఁపటఁ ద్రిగర్తసహితుండై కృతవర్మయు వెనుకఁ గాంభోజసహాయుండై యశ్వత్థామయు నడుమఁ గురువీరపరిరక్షితుం డయి కౌరవేశ్వరుండును నతనిముందటఁ గరిఘటాగ్రభాగవర్తియై బహులచతురంగంబులతో దుశ్శాసనుండును

నిలుచునట్లుగా నొనర్చి పేర్చి యురవణించె నంతకమున్న పాండవులు మూఁడుమొగంబులుగా మోహరించిరి ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకు లగ్రేసరులుగా భీమార్జును లగ్రజునగ్రభాగంబున శోభిల్లి సితాతపవిద్యోతితం బైన శల్యు కేతనంబు సూచి త్రోచి నడచి రనిన విని ధృతరాష్ట్రుం డప్పటికి మనకుఁ బాండవులకుం గల సేనాంగంబుల కొలంది యెఱింగింపు మనవుఁడు సంజయుండా జనపతి కిట్లను మనకుఁ బదునొకండువేలు రథంబులును బదివేలు నేడునూఱు గజంబులును రెండులక్షలు హయంబులును మూఁడుకోట్లు పదాతులును వారికి నాఱువేలు రథంబులును మూఁడువే లేనుంగులును లక్షగుఱ్ఱంబులును గోటి కాల్బలంబులును గలిగియుండె నయ్యుద్ధనంబు లొండొంటి గెలుచు నగ్గలిక డగ్గఱియె నట్టియెడ. ౧౧౩

ఒండొరులన్ జయించుమతి నుద్భటలీలలఁ జాల నొప్పి యా
ప్పాండవకౌరవుల్ పెనఁగు భంగిఁ గనుంగొను వేడ్క నొక్క యా
తండు మహాద్రి నెక్కె ననఁ దద్దయుఁ జెన్నగు బింబకాంతి న
ర్కుం డభిరాముఁడై పొడుపుఁ గొండపయిన్ వెలుఁగొందెఁ
జూడఁగన్. ౧౧౪

అరసి యనాగతం బెఱుఁగునట్టి మనంబులు గల్గు పాండుభూ
వరసుతబంధుమిత్రకురువర్గసుహృజ్జనకోటు లత్తఱిం
బొరసె నతిప్రమోదమును భూరివిషాదము నాఁగ నంబుజో
త్కరము వికాస మయ్యెఁ గుముదంబులు మీలన మొందె
నంతయున్.

కుంజరనికురుంబకుంభస్థలీసంగ
సిందూరరుచులతోఁ జెలిమి చేసి
కేతనవ్రాతసంకీలితమాణిక్య
రశ్ములగెడ విహారంబు సలిపి
సైనికనికరవక్షస్స్థలపరిలిప్త
కాశ్మీరదీప్తులఁ గౌఁగిలించి
దండనాథోత్కరచండభావోద్వృత్త
చక్షుఃప్రభలఁ దారు సరస మాడి
యంశుజాలంబు లుభయసైన్యంబులందుఁ
బరఁగి బహువిధశస్త్రాస్త్రకిరణతతుల
బెరసి పరభాగలక్ష్మి దీపించి మెఱయ
బాల్యరమణీయుఁ డగుచిత్రభానుఁ దోఁచె. ౧౧౬

—: కురుపాండవుల పదునెనిమిదవనాఁటియుద్ధప్రారంభము :—

ఇట్లు పూర్వసంధ్యాసమయంబునఁ దార్కొని భేరీప్రముఖ తూర్యనిస్వనంబులు నింగి వ్రాఁగం జెలంగ. ౧౧౭

ఒండొంటిఁ దాఁకి హేతులు
మండఁగఁ దచ్చూర్ణతతులు మహి చాలఁగ ను
ద్దండతఁ గలయం బెరసెను
రెండు మొనలుఁ గ్రూరతరపరిస్ఫురణములై. ౧౧౮

ఇత్తెఱంగునఁ దలపడి. ౧౧౯

అరదంబులు నరదంబుల
గరులు గరుల హరులు హరులఁ గాల్వుర మఱి గా
ల్వురఁ దాఁకి పెనఁగెఁ గడుభీ
కరభంగులు మెచ్చుదేర గగనచరులకున్. ౧౨౧

పెనుపున నాకసం బవియ బృంహితముల్ దమ నుగ్రగర్జిత
స్వనములతోడ మేఘములచందము గా నొనరింప మీఁది మే
ఘనికర మేయు సాయకవితానము భీషణవృష్టి గా రయం
బునఁ బఱకొన్న సేనఁగులపోరునఁ దేరులు దేలె నెత్తుటన్.

కరులగమి వాఁడివి రథముల్ గాలుకొనఁగ
నీక మరలినఘోటకానీకములను
బిరుదుమగలమొత్తములను బిండిపీఁచు
సేయుబలితంపునేర్పు లచ్చెరువుఁ బెనుప. ౧౨౨

పటురయమున నాశ్వికు లొ
క్కటఁ బెక్కం డ్రెక్కి రథనికరములు ఝుడితి
త్రుటితాశ్వతులు గ విహరిం
చుట యొక్కడు వేడ్క సేయ సురగణమునకున్. ౧౨౩

పలువురనొక్కరుం డొక్కనిఁ
బలుపురుఁ డెగటార్చుటయును బలుతెఱఁగులమూఁ
కలు పలుతెఱఁగుల దలపడి
బొవిదించుట పొలియుటయును బోగి నుగ్రముగన్. ౧౨౪

చలమునఁ బోక పెనఁగుకా
ల్బలముపయిం దురగమును నిభంబులు నరదం

బులుఁ గూడి కవిసి యింతిం
తలు మనియలు సేఁత యనుచితక్రౌర్యముగాన్. ౧౨౫

తెల్లనిసవరణ మెఱయ స
మ్ముల్లసితము లగుతురంగముల మొత్తము చం
చల్లలితపక్షములు శో
భిల్లుగతుల నొప్పునంచపిండుం బోలన్. ౧౨౬

అయ్యిరువాఁగును బేరు వాడునప్పుడు. ౧౨౭

గుణవినదము రణనేమి
క్వణనంబుం దురగఖురరవముఁ గరిఘంటా
రణనమును హేతిసంఘ
ట్టణనాదముఁ దూర్యఘోషసంపదఁ గడచెన్. ౧౨౮

నెత్తుటఁ దోఁగియు నిగిడి పోరెడువీరు
లలరిన నడ మోదుగులవిధంబు
గ్రిక్కునఁ దెగిపడి కదలెడుబాహుదం
డములు మహాభుజంగములభంగి
యవని రక్తాక్తంబు లై యున్న యట్టిబల్
దలలు గెందామరకొలనిపగిది
దఱచుగా నెఱి దప్ప నొఱగినజగములు
కులిశభగ్నాచలకులమునట్లు

మనిసి తొఱఁగినజోదులతొడలు సామ
జములకరములు నొండొంటిచందములు గ

నుంగొనఁగ వింత లగుటను సంగరాంగ
ణంబు రమణీయమును భీషణంబు నయ్యె. ౧౨౯

ఏమి చెప్పుదు రౌద్రంపుటెసక మరుదుఁ
దఱచు మెదళులు ఱొంపులు నుఱుము లైన
యెమ్ము లిసుకయు సితచామరమ్ము లంచ

లయ్యె రుధిరంపు టేఱుల కప్పు డధిప ౧౩౦
విను మయ్యేఱులలో వా
హనములె యోడలుగఁ జూడ నక్కజ మగును
క్కన నుద్దామవిహారం
బొనరించిరి వీరయోధు లుర్వీనాథా. ౧౩౧

ఇవ్విధంబునం బోరు ఘోరంబై చెల్లుచుండ నుల్లసితవిక్రమ విజృంభితులగు భీమపార్థులు నలిరేఁగి నారాచప్రముఖనానావిశిఖంబుల మనమొనఁ గనువు గొట్టిన నది బెగ డొంది మగిడిన నమ్మొటిమగ లుబ్బి పౌండ్రదేవదత్తంబుల నొత్తుటయు ధృష్టద్యుమ్నుండును శిఖండియుఁ గౌంతేయాగ్రజు మున్నిడికొని తఱుమఁ దొడఁగ కవలును గడంగి రట్లాటోపదీపితులైన పాండవేయుల యురవడికి నోటఱి నీబలంబు హాహాకారంబులతోఁ బలుదెసలఁ బఱవం దొడంగినం గనుంగొని శల్యుండు సారథి కిట్లనియె. ౧౩౨

అల్లదె కంటె పాండుతనయాగ్రణితేరు సితాశ్వయుక్తమై
తెల్లనిమెల్లి నొప్పినది తీవ్రత మాఱ్కొని యానృపాలుతో

భిల్లుట మాన్పఁగా వలయు భీషణభంగి రథంబు వోవ ని
మ్మొల్లజనంబు నాకడిమి యేర్పడ నేఁ డెఱుఁగంగఁ జేసెదన్.

సురలనైన గెలుతు దురమున విను
నాకుఁ బాండుపుత్రు లెదురె భండనమున
నేర్పుబలువుఁ జూపి నిన్ను మెప్పింతు నా
చేతిబరువు సూడు సూతవర్య. ౧౩౪

అనుటయు వాఁడు పాండవబలంబుల కెదురుగా నరదంబు సముచితరయంబున నడప నమ్మద్రపతి సముద్రసముద్రేకంబు చందం బైనయాసైన్యంబు శరభసత్వంబు చెలియలికట్టయుం బోలి యుడుపుట యచ్చెరు వై యుండె నట్లు శౌర్యధైర్యంబుల నుల్లసిల్లుశల్యుం జూచి మనమూఁకలును మగుడ నిగిడిన సంగ్రామంబు భీమం బయ్యె నందు నకులుండును గర్ణపుత్రుం డగుచిత్రసేనుండును దలపడి యొండొరువులకుఁ గృతాస్త్రత్వంబును సమరవిశారదత్వంబును జూపుచుం బెనంగు నెడ నాసూతపుత్రుండు. ౧౩౫

— కర్ణకొడుకులు చిత్రసేనసత్యసేనసుశర్మలు నకులునిచేతఁ జచ్చుట —

నకులునిచాపదండము ఘనప్రదరంబునఁ దున్మి భాస్వరాం
బకములు మూఁడుదీవ్రగతి ఫాలతలంబున నాటి త్రుంచె ఘో
టకములఁ గేతనం బిలఁ బడన్ విదళించి వధించె సూతు ఖే
టకమును ఖడ్గముం గొని కడంగఁ బయిం బరఁగించెభల్లముల్.

ఆనిశితభల్లములు దన
మేనికి రాకుండఁ బలుకఁ మొఱయ జడియుచుఁ దా
వే నిగిడి కదిసె మాద్రీ
సూనుం డాసూతసూతిసూనునరదమున్. ౧౩౭

కదిసి మీఁదికి లంఘించి మద మెలర్ప
గళము దునిమిన నమ్మస్తకంబు డొల్లెఁ
గర్ణపూరకిరీటసంకలితవివిధ
రత్నరోచులు మెఱయ ధరాతలమున. ౧౩౮

ఇట్లు చిత్రసేనుండు వడినం గనుంగొని కౌంతేయసైనికు లార్చినం బేర్చినశోకరోషంబులు మనంబుల ముప్పిరి గొన వానిసోదరులు సత్యసేనుండును సుశర్ముండును నప్పాండుపుత్రుపైఁ గవిసిన నతండు వేఱొక్కతే రెక్కి బలువిల్లెత్తి దండధరప్రచండమూర్తియై మార్కొనిన నబ్బిరుసుమగ లయ్యరదంబు భల్లంబుల నఱకం దొడంగిన నుఱక చిఱు నవ్వునవ్వి.

కడువడి సత్యసేనుతురగంబులఁ గూల్చి శరాసనంబుఁ జక్కడిచిన నొండు తేరికి రయంబు మెయిం జని యన్యచాప మెక్కిడుటయు నక్కుమారునిశితేషుయుగంబున నొంచినొంచెఁ గ
వ్వడియనుజన్ముఁ డుగ్రుఁడయి వానిసహోదరు రెండుతూపులన్
అతనిధను వాసుశర్ముఁ డుద్ధతి దలిర్పఁ
ద్రుంచుటయు నొండువింట బల్దూపు లొడలఁ
బఱపి వానిశిరంబును నఱకి సత్య
సేనువిలు ద్రుంచె నాపాండుసూనుఁ డధిప. ౧౪౧

ఆరాధేయతనూజుఁ డన్యధను వుగ్రాకారుఁడై యెత్తి దు
ర్వారప్రక్రియ నేసె నావిశిఖముల్ వారించి యాతం డతి
క్రూరస్ఫారశరత్రయంబు బతనివక్షోభిత్తిఁ గీలించి వే
నారాచంబులు రెండుదమ్మునిమెయిన్ నాటెం గడున్ బెట్టుగన్.

వారలిగి యొక్కయుమ్మడి
సారథిఁ దెగటార్చి యార్చి చాపము దునియం
దేరు వికలము గ మేను వి
దారితముగ నేసి రత్యుగ్రోదగ్రస్ఫురణన్. ౧౪౩

ఇవ్విధంబున. ౧౪౪

విరథుండున్ వినికృత్తచాపుఁడు శరావిద్ధుండు నై మేదినీ
వర నీపుత్త్రుఁడు చంచదుగ్రతరజిహ్వాంబైనచండాహి నాఁ
గర మాభీలతఁ బొల్చుశక్తిఁ గొనియుల్కన్ సత్వరుండయ్యె సు
స్థిరసంరంభత సత్యసేనుఁ బడవైచెం జూపఱుగ్గింపఁగన్. ౧౪౫

అన్న పాటు సూచి యనుజుఁ డుల్లంబున
నడలు కనలుఁ గదుర నంపవానఁ
గప్పె నతులు నంతఁ గాంచి భీముతమ్ముఁడుఁ
డెయిదె నతనియరద మెక్కె నతఁడు. ౧౪౬

ఇట్లు ద్రావిడదేశుం డగు శ్రుతసోమునియరదం బెక్కి బలు
విల్లు గొని యక్కుమారుండును దోడుపడ నాసుశర్ముని బలు
శరపరంపరలం బొదివినఁ బోలివోక యతండు. ౧౪౭

వాఁడితూపులు నతులుమై మూఁడునాఁటి
యిరువదింటఁ దత్పుత్రునియురము నొంప

సర్ధచంద్ర బాణాహతి నవ్విరోధి
శిరము దునిమె నప్పాండు భూవరసుతుండు. ౧౪౮

మాద్రీపుత్రునిచేతఁ గర్ణసుతు లీమాడ్కిం బడం జూచి పి
రోద్రేకం బెడలంగ నీసుతుబలం బొక్కుమ్మడిన్ విచ్చిన
న్మద్రాధీశుఁడు సింహనాదము రణన్మౌర్వీసముల్లాసమున్
రౌద్రప్రక్రమ సూచకంబులు గ సంరంభస్ఫురన్మూర్తి యై.

హస్తతల మెత్తి నిలునిలు మని యదల్పఁ
బోక తిరిగియమ్మూఁకలు పోరి కమరెఁ
బాండవేయులమొనలు నుద్దండవృత్తి
నురవణించిన సంగర ముగ్గమయ్యె. ౧౫౦

అడరి ధనంజయాదు లగునక్కడిపేరులు విక్రమింప ని
క్కడ భవదీయనందనముఖ ప్రభవోద్భట యోధవర్గము
ల్వడిఁ దఱుమంగ నప్పుడు బలద్వయమున్ విశిఖాగ్ని వేర్చెమె
క్కుడగు నభీతి నొందెరణఘోరత భూవర యేమి సెప్పుదున్.

ఇట్లు మథిలం బయ్యును బౌరుషంబు పెంపున నిరువాఁగును
వేగంబు గుందక వింతచందంబునం బేర్చుచుండు గగనచరు
లకుఁ గన్నులపండువుగా బృంహితధ్వనులను ఘంటానినదంబు
లను నేమినిస్వనంబులను కేతుకింకిణీక్వాణనంబులను ఝంకారవం
బులను హేషాఘోషంబులను భుజాస్ఫాలనంబులను సింహనా
దంబులను దిక్తటభేదనం బొనర్ప సద్భుతోత్సాహంబున నా
హవక్రీడ సలుపుచుండఁ బుండరీకాక్షరక్షితు లగు పాండుపు
త్రుల బలశౌర్యసంపదల సొంపునం బెం పొదవు ధృష్టద్యుమ్న

శిఖండి సాత్యకిప్రముఖు లైన దండిమగలు గూడికొని తఱుమ
దారుణనైపుణంబున బాహాటోపంబు సూపినఁ గార్చిచ్చు
గవిసినం గలంగు మృగకులంబు కైవడిం గౌరవసైన్యంబు దై
న్యంబు నొందిన. ౧౫౨

పెనురొంపిలోపలను బ్రుం
గినధేనువు నెత్తుపోలికిని శల్యుం డ
మ్మెనఁ దనభుజబలమునఁ గలఁ
గనియట్లుగనిలిపె శౌర్యగర్వము మెఱయన్. ౧౫౩

నిలిపి పేర్చిన సమయంబున మనదిక్కున నులూకపాత్రప్రము
ఖంబు లగు దుర్నిమిత్తంబులు వొడమిన నీకొడుకులు గూడి
కొని చేయం గలసైనికులఁ గూర్చికొని తిరం బయి పెనంగి
రట్లు పెనంగు నెడఁ గడంగి తలకడచి మిగిలి మద్రిపతి మా
ర్గణాసారంబు వరఁగించుచుఁ బాండవాగ్రజు నగ్రభాగం
బున నున్న భీమసేనసాత్యకి ధృష్టద్యుమ్నశిఖండి ద్రౌపదేయ
మాద్రేయులఁ దాఁకి పదిపదిప్రదరంబుల నొప్పించి కదిసి
యస్సురపతికిని బదితూపుల వేఁడిమి సూపి మలసినఁ బాంచాల
ప్రభద్రక బలంబు లాజెట్టిబిరుదుచుట్టుముట్టిన. ౧౫౪

వాలి యతండు బాహువిభవం బలరించినఁ బేర్చి రౌద్రతం
గూలుగజంబులుం గెడయుగుఱ్ఱపుతండములుం ద్రెళ్ళుతేరులుం
గీలెడలించినట్లు పడుకేతువితానము నుగ్గునూచ మై
రాలుపదాతివర్గములు రక్తపుటేఱులుఁ బ్రేవుప్రోవులున్. ౧౫౫

మఱియును. ౧౫౬

ఏరూపు లయిన రూపఱ
ఘోరాశనులట్ల శల్యుకూరిగాస్త్రంబుల్
కౌరవులు వొంగఁబొందుదు
మారులసేనపయిఁ బారిఁగె మనుజాధీశా. ౧౫౭

అట్లు దొరుఁగు దారుణమార్గణాసారంబున వెగడుపడి యా బలంబు పాండవాగ్రజు వెనుక కొదిఁగిన నమ్మహీపతి పురికొలిపికొని శల్యు మార్కొని నిశితవిశిఖవర్షంబునం బొదివిన నమ్మద్రవిభుండు గూరినారాచం బతనిమే నుచ్చిపో నేయ నాధర్మనందనునకుఁ దలకడచి యే డమ్ముల నవ్వాడముడియు సహదేవుం డయిదు తూపులను నకులుండు నవశరంబులను బ్రతివింధ్యాది ద్రౌపదేయులు బహుబాణపరంపరలను నవ్వీరు నేయ నప్పుడు కృపాచార్యుండును కృతవర్మయు శకునియుఁ దత్సుతుం డులూకుండును నీకొడుకులుం గవిసిరి గురుపుత్రుండు మందహాసంబుతో నమందగతి నచ్చి వారిఁ గూడికొనియె నక్కడి సైనికులును రభసంబున నారథికవరులఁ దాఁకి రట్టియెడ. ౧౫౮

కృపుఁడును ధృష్టద్యుమ్నుఁడు
నుపమాతీతాతి ఘోరయుద్ధంబున బా
హుపటుత్వమ్ములు సూపి ర
థిప యొండొరులకు సమత్వ దీప్తాకృతులై. ౧౫౯

ఒకని నొకని బదిపదిసా
యకముల నొప్పించె వీరు లగుపాండుకుమా

రకు లేవుర సంకట ద్రో
ణకుమారుండు మోహము చింతనగవుగ నొప్పెన్. ౧౬౦

వాయుతనయు ఋశ్యవర్ణాశ్వముల మద్ర
పతిధరిత్రిం గూల్చి నతండు దేహ
డిగ్గి నిజగదాపటిష్ఠితం జూపెం గౌ
రవ్యసైన్యమునకు రాజముఖ్య. ౧౬౧

అనిలజునియశ్వములం గూ
ల్చినయప్పుడు శల్యునిం గలితనము మెఱయం
దనయాంపవెల్లిచే సుం
చె నకులుతమ్ముండు సీదుసేన దలంకన్. ౧౬౨

అతనిసహాయసుతులు నమ్మద్రపతిశరములం
బడిన నప్పుడవునిం దలకడచి బలము
పొడిచె నమ్మోధసుఖ్యుం దత్పుత్రుం డవుడు
గదిసె సాసహదేవుపైం గడింది మెఱయ. ౧౬౩

కవిసిన దట్టకెంపడరుకన్నులతోడం గ్నపాసాని యై
యవనికి బాంటిరి మాతనిశరావలి ప్రసుంచుచుం గిట్టి తేరిపై
కి వడిం జలంబుమై నరిగి కేళియుపోలె శిరంబు ద్రుంచి వో
యె వెసం బొగడ్త కెక్క ధరణీశ్వరనూంఢురథంబుమీంకిన్.
ఇవ్విధంబున. ౧౬౪

సుంగుం డీల్చిన మద్రమహీ
పతి శోకక్రోధవేగభరితాత్ముం డై

శితశరపరంపరల ను
ద్ధతిఁ బాండవసైనికులమీఁదం బడఁగించెన్. ౧౬౬

— శల్యభీమసేనుల గదాయుద్ధము —

ఉరవడి రథికజనంబులఁ
దెరలిచి యోమారుతనయు తేరు మొఱయ ను
ద్ధురగతిఁ గౌంతేయాగ్రజు
నరదమునకుఁ గవిసె వాలురమ్ములు నిగుడన్. ౧౬౭

కనుఁగొని భీముండు గన్నులనిప్పులు
రాలఁ జండాలకీలాలరంజి
తంబును రిపుసైన్యదైన్యప్రదంబును
నాత్మీయవాహినీహర్షకరము
నై శతధారామహాభుజగక్షమా
ధరశృంగసమత నుదగ్ర మగుచు
నెనిమిదియంచుల నెసఁగు మెఱుంగుల
దారుణం బగుగదాదండ ముగ్ర
రేఖ సారించి రౌద్ర ముద్రేక మందఁ
గదిసి మద్రాధిపునితురంగములఁ జదియ
మోఁదె నాతండు దోమరమునఁ దదీయ
విపులవక్షంబు భేదించె నృపవరేణ్య. ౧౬౮

ఉరమున నాఁటినఘనతో
మరమును డాచేతఁ బెఱికి మారుతి మద్రే
శ్వరుసూతు వైచె దానన
ధరణిని బోరగిలఁబడ నుదగ్రస్ఫురణన్. ౧౬౯

విరథుం డై పొలివోనిదర్పమున నవ్వీరుండు ఘోరంపుము
ద్గరముం గేల నమర్చి తేరు డిగి దుర్ధాంతాకృతిన్ వజ్రభా
సురశక్రుండును దండచండయముఁడున్ శూలోగ్రఫాలాక్షుఁడున్
సరి సేయం దగువారు గాఁగఁ బొలిచెన్ సంస్తుత్యసంరంభతన్.

ఇ ట్లవష్టంభవిజృంభితుం డైనయాసేనాధిపతిం జూచి యేచి భీముఁ డుద్దామసారభసంబున నతనికి సమ్ముఖంబుగా నడరినఁ బణవాదివాదిత్రనిర్భరనినదంబులు సెలంగె నప్పు డయ్యిరువాఁగు నిరువుర నేనికపోరు చూచువిధంబునఁ గనుఁగొనుచు గదారణంబునకు శల్యుండు దక్క మారుతి మార్కొనఁ జాలు మేటిమగలు నివ్వఁడముడి వెలి గా నిమ్మద్రపతిమీఁదఁ గవియునట్టి జెట్టిబిరుదులుం గలరే యనుచు నచ్చెరు వొందుచుండ. ౧౭౧

మండలప్రచారమహితాకృతులు గర్జ
నలుగఁ బొలిచి మాఱుమలసి అంకె
లెసఁగఁ బోరి కమరి యేపారువృషభయు
గంబునట్లు వారు గవిసి రధిప. ౧౭౨

మదమున నిమ్మెయిం గదిసి మద్రవిభుండును భీమసేనుఁడున్
గదలమెఱుంగు లాకసము గ్రమ్మఁగ నుద్భటభంగిఁ ద్రిప్పి బె
ట్టిదముగ వ్రేయ నిప్పులు వడిం దొరఁగించె సమగ్రవిస్మయ
ప్రదరవభంగు లై యవి పరస్పరఘోరవిఘట్టనంబునన్. ౧౭౩

ఇట్లు దొడంగి. ౧౭౪

ధిక్కారంబులు చరణాద
భక్కారంబులును మెఱయ బలువు వెరవు పే

రుక్కును నెక్కుడు వేగము
నక్కజములు గా నుద్దీర్ణులై పోరు నెడన్. ౧౭౬

వెరవున సంగముల్ నసుల వ్రేటులు వమ్ముగఁ దాఁకినప్పు డి
క్కరదనప్రహారముల గంపము నొందక యుండు మేదినీ
ధరముల బోల్పఁ బట్టగు సదాగ్రపుమూర్తుల కిద్ద అందు ని
ష్ఠురరభసంబు శౌర్యము పటుత్వము బ్రాసునఁ బెట్టినట్లుగున్.
ఒక్కొక్కమా ఱుబ్బున. ౧౭౭

ఎనిమిదియడుగులకోలఁ బిని
వెనువెనుకకుఁ బోయి నిగిడి వేగంబునఁ గి
ట్టినతగళులకై వడిఁ దాఁ
కునగంబులభంగి దాఁచుఁ గురుకులముఖ్యా. ౧౭౮

ఇత్తెఱంగునఁ బెనంగి నెత్తుటఁ జొత్తిల్లినయంగంబులు పుష్పిత
కింశుకంబులఁ బోలఁ బరిశ్రమంబు నొందియుఁ బోలిపోవని
దర్పంబున. ౧౭౯

గదాయుద్ధమున మూర్ఛితుఁడైన శల్యునిఁ గృపుఁడు తోలంగొనిపోవుట.

ఇరువురును సందు సూడక
వెర వెడలినయాగ్రహముల వ్రేసినగద లొం
డొరులమెడల కెలఁకుల బ
ల్పరములు దాఁకుటయు వారిలం బడి రధిపా. ౧౮౦

ఇవ్విధంబున నమ్మహావీరులు మూర్ఛిల్లుటయు నుభయసైన్య
జనంబులును హాహాకారముఖరులై రట్టియెడఁ గృపా
చార్యుండు శల్యుకడకుఁ దనరథంబు రయంబునం బఱపించి.

పడియున్న గద విడువనియు
క్కడిందిమగని గ్రుచ్చి యెత్తి గారవమున నం
దడి తొలఁగం గొనిపోయెను
వడముడి దెప్పిఱి యె నంత వసుధాధీశా. ౧౮౨

తెప్పిఱి లేచి చూచి సేద దేఱినయమ్మ్రపతిం జేకొని
యుద్దండగదాదండమండితం బై నకరంబునం బిలిచె నయ్యుర్వ్రపతి
సహింపఁజాలకసింహనాదంబుతోడదూర్యస్వనంబులు సెలంగఁ
గురుభూవరుముందరిసైనికులు రభసంబుగా నతఁడునుఁ గూడి
కొని తఱుమఁ గవిసినం గౌంతేయాగ్రజునగ్రభాగంబున రథి
కులు చేకితానపురస్సరు లై యూర్పులు నింగి ముట్ట నయ్యా
నిలతనయుఁ దలకడచి వారిం దలపడి పెనంగి రప్పుడు. ౧౮౩

ఆకౌరవ్యవిభుండు వజ్రకఠినం బై యొప్పుప్రాసంబు దీ
ప్తాకారోజ్జ్వలవృత్తి నెత్తి నిజసైన్యం బుబ్బనం గ్రాలఁ గే
లీకల్పంబు గ మింట జంటమెఱుఁగు ల్పిండం బ్రదీప్తక్రమ
శ్రీకాంతుం డగుచేకితానుఁ బడవైచెం జూప అగ్గింపఁగన్.

ఇట్లు చేకితానుండు వీతాసుం డై నం గని కౌంతేయులు గోపా
టోపంబున సైన్యోపేతగతిం గడఁగి కౌరవసైన్యంబులపైఁ
బటుబాణంబులు గురియుచు నడరిన శల్యుండు ధర్మపుత్రుని
దుర్యోధనుండు ధృష్టద్యుమ్ను నమ్మహీపతి పనుప నశ్వత్థామ
త్రిగర్తులు మూఁడు వేలరథంబులవారు విష్వచ్ఛుని మహో
త్సాహంబున మార్కొనిరి తక్కటియోధులు సేనయు నవి
రోధనరూఢిగలయుం బెరయుటయు నక్కజం బయ్యె నప్పుడు

పెంధూళి మొగసి చూడ్కులు నిగుడ కున్నను సైనికుల సింహనాదంబులు సెలంగం జేయుటయు బిరుదులు ప్రకటించుటయు బోధకంబుగాఁ బోఁన భోరనఁ దొరఁగుశోణితం బారే ఱువు నడంచినఁ బ్రిదుం బంది యురువాఁగును వ్రేయుండు పొడువుం దను నెలుంగులు నింగి ముట్టఁ బెనంగు నట్టియెడ.

బరవస మొప్ప మద్రపతి పాండవముఖ్యునిమీఁదఁ గాండముల్
గురిసిన నాన్నృపాలుఁడు నకుంఠితుఁడై పదునాల్గుతూపు ల
న్నరపతిమేనఁ గ్రుచ్చి యెలనవ్వున నొప్పిన నమ్మహీశుపే
రురమున నాటె సారథికిఁ దొక్కసముజ్జ్వలబాణ మేసె నన్.

నాటినం గనలి యమ్మనుజేంద్రుండు చంద్రసేనుం డనుతదీయ చక్రరక్షకుం దునిమి నవనారాచంబులు సారథిమేన నిగిడించె.

అపుడు శినివరుండు ననిలపుత్రుఁడుఁ జేది
బలము శల్యుఁ దీవ్రభంగిఁ బొదువ
నాతఁ డాధనంజయాగ్రణిఁ బటుతర
పంచమార్గణముల నొంచె నధిప. ౧౮౮

విను మిరువదియేడమ్ముల
శినిమనుమనియు బ్బడంచెఁ జేదిరథికులం
దునిమెం దీవ్రశరోత్కర
మున నిరువదియేవురఁ సముద్భటభంగిన్. ౧౮౯

కవలు తనమీఁద రయమునఁ
గవిసిన నిశితతరసాయకములను మార్వ

రవము సెలంగఁగ వారల
యువయువముల నినిచె నతఁ డహంకృతి మెఱయన్. ౧౯౦

కనుఁగొని ధర్మసూతి భుజగర్వ మెలర్పఁగ బెట్టు గిట్టి శ
ల్యుని మెయిఁ దీవ్రమార్గణసముత్కరముం బరఁగించి కేతువుం
దునిమిన నాతఁ డాపతికిఁ దూపులవేఁడిమి సూపి వాయుసూ
నునిఁ గవలన్ శినిప్రవరు నొంచె వడిం బదియేసి యమ్ములన్.

నొంచి మదించి ఖేచరమనోహరుఁ డై వడి ధర్మపుత్రు గ్రు
క్కించి మహోగ్రబాణపరికీలితదేహునిఁ జేసె దానఁ గో
పించి శితాస్త్రముల్ గవలు భీముఁడు సాత్యకియుం గడంక గు
ప్పించిన వానిఁ ద్రుంచి శరపీడితదేహులఁ జేసె వారలన్.

చేసి యొండొకభాసితధ్వజం బెత్తించి మెఱసిన. ౧౯౩

భీముఁ డాతని మెయి బెడిదంపునారసం
బడరించి వెండియు నట్టి వేడు
వఱపె సాత్యకి శతబాణంబు లతనిపై
బెట్టేసె మాద్రితొల్పట్టి యైదు
తీవ్రాస్త్రముల సహదేవుండు పదునాలు
గమ్ముల నవ్వీరునంగకములఁ
బరఁగించి రమ్మద్రపతి భీమసేనాదు
లైనయన్నలువుర నతిరయమున

వరుస జెబ్బదిమూఁటను నిరువదేను
వాఁడితూపుల నేనింట మూఁడుమార్గ

ణాము౯ బీషితులుగఁ జేసె నడికె భల్ల
నిహతి సహదేవుచాపంబు నృపవరేణ్య. ౧౮౪

ఆమాద్రీసుతుండన్యచాపధరుఁడై యత్యుగ్రబాణంబులన్
మామామెక్కుడఁబోయె దంతు వెస నమ్మద్రేశు నేయంగ ను
ద్దామోదగ్రత భీమసాత్యకులు శాతప్రస్ఫురన్మార్గణ
స్తోమంబుల్ గురియంగ ధర్మసుతుఁడుం దూపుల్ మెయిం
గుప్పెగన్. ౧౮౫

కనయంగ నెత్తురుల్ దొరఁగఁ గైరికనిర్ఝరజాలరంజితా
చలమును బోలి పొల్పెసఁగి శల్యుఁడు వారల నస్త్రపంచకం
బుల వెస నొంచి త్రుంచెఁ గురుభూవర ధర్మజుచాపమమ్మతో
బలమును శౌర్యముం సురలు ప్రస్తుతి సేయ మహోగ్ర
మూర్తి యై. ౧౮౬

వేఱొకచాపమెత్తి పృథివీవర ధర్మతనూజుఁ డింతతోఁ
దీఱఁగఁ జేయుదుం బగ యతిప్రకటంబుగ నంచు నూతుమైఁ
దూఱఁదురంగమాంగములు దూఁటులుపోవఁగ శల్యునెమ్మలన్
గీఱ సిడంబు గాఁడఁ బరఁగించె సముజ్జ్వలచండకాండముల్.
ఇవ్విధంబున విజృంభించిన. ౧౮౭

కోపించి యతఁడు దర్పా
టోప ముదగ్రముగ దశపటుప్రదరము లా
భూపాలుమేనఁ జొనిపిన
భూపాలక యాతఁ డొల్లఁబోవుటయు వెసన్. ౧౮౮

ధర్మరాజు శల్యుని బాణంబులచేత మూర్ఛితుం డగుట.

శైనేయుఁ డడరి యుజ్జ్వల
నానాశిఖముల మద్రనరపతిఁ బొడువం
దా నలిగి విల్లు దునియలు
గా నొకభల్లమున నేసి గర్వోద్ధతుఁడై. ౨౦౦

ఆరథికవరుని నకులుని
మారుతి సహదేవు మూఁడుమార్గణముల నే
పారఁగ బలుపారఁగ రయ
మారఁగ నొప్పించె నమ్మహాభుజుఁ డధిపా. ౨౦౧

అంతఁ గెలిసి యక్కౌంతేయాగ్రజుండు మద్రపతి ముద్గరంబున నేయ నవ్విరోధిపై సాత్యకి తోమరంబును వృకోదరుండు భల్లంబును నకులుండు శక్తియు సహదేవుండు గదయును బ్రయోగించిన నయ్యోధవరుండు వాని నన్నింటిని మింటమెఱుంగు లడరు వెడఁదయమ్ములు వరఁగించి త్రుంచి యార్చినం బేర్చిన రోషంబున నాకృష్ణానుజుండు సారథి మూఁడువాఁడితూపుల నవ్విరోధి రెండుబాణంబుల బెట్టేసినఁ గ్రోధదీప్తుండై ప్రచండకాండంబుల నయ్యేవురను గ్రుక్కించిన నీపుత్రుం డతనిచేతఁ బాండుపుత్రులు పొలియుదు రని తలంచె నట్లు భాసమానుం డైన సేనాపతిం గని భీమసేనుండు సహింపక తెంపున బెట్టు గిట్టిన. ౨౦౨

శినిమనుమడు గవలును దో
డన యురవడి నడరి పొదువుటయు నగ్గలికం

బెనఁగె నతం డానలువుర
కనలుఁ గడంకయును సరకు గాఁ గొన కధిపా. ౨౦౩

ఇట్లు పెనంగుచుండఁ బాండవాగ్రజుండు మున్ను దనచేతఁ జచ్చిన చంద్రసేనుకొడివాని ద్రుమసేనుఁ దల ద్రెవ్వ నేసినఁ జక్రరక్షకహీనుండయ్యును బొలివోనికనలున శల్యుండు సటలు వెఱికినం గోపించు సింగంబుచందంబై సమీరణసుతాదు లగు జోదులనలువురయంగంబులఁ దురంగనికరశరీరసారథి నికాయసహితంబుగా బహువిధవిశిఖంబులు వరఁగించి నెత్తురులు దొరఁగించినం గని యాధర్మనందనుండు విషాదంబు నొంది నిజాంతర్గతంబున. ౨౦౪

హరివచనంబు లసత్యతఁ
బొరయఁగ నేర్చు నొకొ మద్రభూపతిబాహు
స్ఫురణము భీమాదిరథిక
వరు లోర్వనియట్లు గాఁగ బ్రాలెడిఁ దోడ్తోన్. ౨౦౫

అని తలపోసి తనబలంబునకుఁ జేయి వీచినఁ దోయధివీచి వితానవిలాసంబు చందంబునఁ జతురంగంబులు శల్యుపైఁ గవిసిన నాధైర్యధౌరేయుండు మందర నగంబులీలఁ గైకొని వారలం గలంచి పాంచాలపుత్ర ప్రభృతి యోధప్రకరంబులను బాండవాగ్రజునిం బరమసాంద్ర తీవ్రశరాంధకారంబునఁ గప్పి సింహనాదంబు సేసిన. ౨౦౬

దివిజగరుడఖచరాదులు
వివిధవచనరచన లెసఁగ వినుతించిరి శా

త్రవభీకరుఁ డగునమ్మ
ద్రవిభుని రణవిహరణములు ధరణీనాథా. ౨౦౭

ఆసమయంబున. ౨౦౮

గురుసుతుఁడు పెనుఁబోవుగా నరునిఁ బొదివి
యధిపసంశప్తకులు వివిధాస్త్రతతులఁ
గప్పి రతఁ డందఱను జండకాండవిదళి
తాంగులుగఁ జేసె దోర్బల మతిశయిల్ల. ౨౦౯

తెరలక వారు పైపయి నుదీర్ణ సముద్ధతిఁ గ్రమ్మి వాజులన్
హారిని సిడంబుపైఁ గడియ నాతఁడు సేద్పడ బాణవర్షముం
గురిసిరి కౌరవేంద్రు మొనకుం బ్రమదం బగు ఘోరభంగి న
ప్పురుషపరాక్రమస్ఫురణ పార్థివసత్తము కాన మెయ్యెడన్.

ఇట్లు సవ్యసాచికిఁ జే యార్ప రాకుండ దర్పంబు సూపిన నా భూవర కుమారవర్యుండు వీరాగ్రహావేశంబున విజృంభించి భల్లార్ధచంద్ర క్షురికాముఖనారాచ ప్రముఖ విశిఖపరంపరలు వరఁగింప నవి యాసైనికులరథ్యంబులంగూల్చియుఁ గేతనంబులు ద్రుంచియుఁ బాణంబులు నఱకియు బాణాసనంబులు విఱిచియు సూతుల గీటడంచియు వరదంబులఁ జెక్కియు మైమఱువులు పొల్లు సేసియుఁ జామరంబులు దునిమియు నాతపత్రంబులు మాపుమాపియు నెత్తురు లురిలించియుఁ గండలు దొరఁగించియు నెమ్ములు వగిలించియుఁ గాళ్ళు ద్రుంచియుఁ జేతులు దునిమియు వ్రయ్యలుగా వక్షంబులు సీఱియు మర్మంబులఁ జొచ్చియు మకుటంబులు డుల్చియుఁ దలలు రాల్చియుఁ

బ్రాణంబులు పీల్చియు రౌద్రంబావహించిన లయకాలరుద్రు
నిసంక్రీడనంబుచందంబు దోఁచె నప్పుడు రథికవరసహస్రద్విత
యంబు దెగటార్చి నవ్వాఁడిమగండు పేరడవి దహించుదావ
పావకునిచందంబున వెలింగెఁ దదీయ తేజోమహిమ సహింపక
యుద్దామగతి నశ్వత్థామ గదిసి యక్కవ్వడిం దొడ్డరి దురం
బొనర్చె నందు. ౨౧౧

అతఁడు పండ్రెండువాలమ్ములా బీభత్సుమెయిఁ గ్రుచ్చి కృష్ణుని
మేనియందుఁ బదివాఁడితూపులు వఱపిన మదిలోన నగ్గించి
యవ్వీరుఁ డలఁతినగవుతోడ రథ్యముల సూతునిఁ గూల్చి
యాతనితనువున నెఱితెగఁగొనక నాటె మూఁడుమార్గణములు
ముసలంబు పరిఘంబు నాతఁడు విగిడింప నదియునదియు

నన్నరుఁడు దోడుతోడ నైదాఱునిశిత
కాండములఁ ద్రుంచి పటుసాయకత్రయంబు
సోనిపె నవ్విప్రుమేన మూర్ఛనియె నపుడు
గడఁగి యప్పార్థు సంశప్తకవ్రజంబు. ౨౧౨

ఇత్తెఱంగున. ౨౧౩

సురథుఁ డను పాంచాలకుమారుఁ డశ్వత్థామచేఁ జచ్చుట.

సురథుఁడు గురుసుతుపైఁ దన
యరదము వఱపించి యేయ నప్పాంచాలో
త్తరు నొకనారసమునకును
నెర సేసె నతండు గినుక యొసకం బెసఁగన్. ౨౧౪

ఇత్తెఱంగున. ౨౧౫

సురథుఁ గూల్చి యతనియరదంబుపైకి ను
ద్ధురత నరిగి గురుసుతుండు చండ
కాండసమితి నిగుడ గాండివిఁ దాఁకి సం
శప్తకులకు సంతసం బొనర్చె. ౨౧౬

అయ్యవసరంబున. ౨౧౭

కురుపతి ధృష్టద్యుమ్నుని
యురవడి గద నిలువరించి యుద్ధతి మెఱయన్
శరపంచకమున నొంచెను
బరఁగించెను మఱియు నవతిబాణము లొడలన్. ౨౧౮

అతఁడు డెబ్బదియమ్ముల నతని నొంప
నన్నరేంద్రుండుఁ జేడ్పడ ననుజసమితి
బలయుతంబుగ నడరి యుబ్బలియుమీఁదఁ
గురిసి రస్త్రశస్త్రంబులు నరవరేణ్య. ౨౧౯

ఆపాంచాలోత్తముఁడు
దీపితకోపుఁ డయి వారిఁ దీవ్రతరశరా
టోపంబునఁ గలఁచె రయం
బేపారఁగ నాత్మసేన కేడ్తెఱ మెఱయన్. ౨౨౦

కృపకృతవర్మలం గడిమిఁ గిట్టి శిఖండిప్రభద్రకుల్ మహో
గ్రపువడి దోడ్పడంగ భుజగర్వము సూపిన నాబలాఢ్యులుం
గుపితమనస్కులై బలువుఁగోల్తలఁ బేర్చినలావు చేవ క

య్యొపు వెర వేపు దాల్మి సరి నచ్చెరుపాటున ముంచెఁ జూపఱన్.
అప్పుడు శల్యుండు యుధిష్ఠిరభీమసేననకులసహదేవసాత్యకి
ప్రముఖులపైఁ బలుబాణంబులు గుప్పించి నొప్పించిన. ౨౨౨

నకులుఁడు రభసంబున సా
యకదశక మతనియురంబునందుఁ జొనుప స
భ్రుకుటి యగుచు నయ్యల్లునిఁ
ద్రికాండముల నొంచి యతఁడు దీపించె నృపా. ౨౨౩

తక్కటినలువురు వాడివిన
నొక్కొకని శరీరమున మహోగ్రాస్త్రంబుల్
పెక్కులు వెసఁ బఱపి మదం
బెక్క నకులుధనువు దునిమె నిషుసహితముగన్. ౨౨౪

ఇట్లు శల్యుండు విజృంభించినఁ గోపించి. ౨౨౫

నకులుం డొండొకచాప మెత్తి పటుబాణశ్రేణిఁ బర్వింపఁ గీ
చకవిధ్వంసి నిగిడ్చె షష్టిశరముల్ శైనేయుఁ డుద్దీప్తసా
యకముల్ దొమ్మిది యేయ ధర్మసుతుఁ డీరైదమ్ము లమ్మద్రనా
యకుపైనన్నియుఁ బిన్నతమ్ముఁడును దోర్దైనాడటనాలుంగడున్.

అతఁడు వెస నవసప్తతిశితశిలీము
ఖముల సాత్యకి నొంచి మార్గణముతోడ
ధనువు ద్రుంచి రథ్యమ్ముల ధరణిఁ గూల్చి
పదిపదుల్ బలుఁదూపులు పఱపె మేన. ౨౨౬

తేరధికులు తను నిమ్మెయిఁ
పోరికిఁ దఱుమంగఁ దాను బురికొన కిచటం
గౌరవపతి డాఁగినగతి
బోరనఁ జని చెప్పవలయు భూనాథునకున్. ౩౭

అతఁడు పసదన మొసఁగు మారుతతనయుని
మున్ను గని మెచ్చు వడయుద మన్న రేంద్రు
నతఁడ కొన్పించు మనల రయమునఁ బోవ
వలయు మాంసభాండంబులు వలదు లెండు. ౩౮

అని మోపులు దిగవిడిచి వెసం బాఱి రయ్యవసరంబునఁ బాండునందనులు నీనందను వెదక ననేకచారులం బొలికలని కెలంకులకుం బుచ్చి యాతండు తమ కగపడమికిఁ జింతాక్రాంతులై యుండ నాబోయలు భీమునిపణిహారులఁ ద్రోచికొనుచుం దన్మందిరంబు దఱియం జొచ్చి యతనిం గాంచి యమ్మడువున నమ్మహీపతి డాఁగి యునికి యెఱింగించి. ౩౯

తమవిన్న మాట లన్నియుఁ
గ్రమమునఁ జెప్పిన నతండు గడుఁబ్రియమున న
ర్థము లొసఁగె వారికి ననే
కములు వహింపంగఁ గొలఁదిగా కుండంగన్. ౪౦

ఒసంగి యాలుబ్ధకుల నగ్రిజుఁ గానిపించి దేవా దుర్యోధనుండు ద్వైపాయన హ్రదంబున నొక్క క్షుద్రవిద్యం జేసి జలంబులు నిజశరీరంబు సోఁక కుండునట్లుగాఁ జేసికొని డాఁగి యున్నవాఁడు పీ రెఱింగి వచ్చి రని యతనికి విన్నవించి

యూసుయోధన గురునందనాదులసల్లాపంబు లెఱింగించిన నతండు పరమహర్షంబున నాబోయలకు బహువిధంబు లగుప సదనంబు లిచ్చి తక్కిన తమ్ములకును గృష్ణునకుఁ జెప్పికొని వారును సకలబంధుమిత్ర పరిజనంబులును దోడన చనుదేర నుద్దామగమనంబున. ౪౧

తురగఖురపుటరథనేమికరిపదాతి
ఘట్టనంబుల నేల గ్రక్కదల శంఖ
పణవనిస్సాణకాహళరణన మొల్ల
దెసలఁ బరఁగంగ వచ్చె నద్దెసకు నధిప. ౪౨

అట్లు ధర్మనందనుం డేతెంచుకలకలం బాలకించి యంతక మున్న రణోత్సాహంబునకై రాజు నిర్బంధించు చున్నయాగ్గు రుపుత్రకృపకృతవర్మ లతనితో ని ట్లనిరి. ౪౩

ధరణీనాయక పాండుపుత్రులు సముద్దామోద్ధతిన్ వీరె వ చ్చిరి వీరిన్ వడిఁ గిట్టి తాఁకుడమొ నీచిత్తంబు పోరాటకుం జొరదే నిప్పటికిం దొలంగి చని యెచ్చోనైన నే ముండి చె చ్చెర రూపించినవేళఁ జెప్పినెడకుం జేరంగ నేతెంతుమో. ౪౪

అనుడు నానృపాలుఁ డయ్యోధవరులతో
నిప్పు డనికి నుత్సహింప కెచటి
కేనిఁ దొలఁగి పోయి యిచటికి మగుడంగ
రండు పగలు సనిన రాత్రి యగుడు. ౪౫

వారు వారణపురంబున కనివారణఁ బోయెదరు వోదురుగాక యిచ్చేరువఁ బోయిరేనియు నిమ్మడువున నాయునికి యెఱుం

గలే రట్లు గాక యెఱింగి రేనియు నన్నుఁ జేరరాదు మదీయ
విద్యావిశేషసంస్తంభితాంభోదుర్గంబున నిర్భయుండ నై యుం
డెదఁ బొం డనినం బొగులుమనంబులతోడ నారథికజనంబులు
వోవం బతి జలంబులు శిలాసదృశంబులు గాఁ బరిస్తంభించె
నేనును బాండుసూనుల చారు యెల్లకడల మెలంగుటం జేసి
రాజు నప్పుడు వెలువరించుట కర్జంబు గా దనియు నతనితో
యుస్తంభనవైదగ్ధ్యం బెఱుంగుట నొలసిన యూఱటను
ముందటియట్ల వారలతోడం జని చని చిత్తంబు గలంగినం
జనం జాలక యరదంబు డిగ్గి యచ్చట నొక్కయెడ నొదిఁగి
నిలిచెద నని వారలకుం జెప్పి యమ్మడుపు నఱుత నొక్క
పఱపు గలపొదయిఱాఱిమిం దూఱి పొంచియుండితి వారలు
దూరంబు సని యొక్కవిపులవటంబుపొంత విశ్రాంతి నొంది
నీనందనువలనికిం జనిన హృదయంబులతోఁ దదీయకార్య
చింతాభరంబు పట్టుకొనఁ దదనుబంధసంభాషణంబులు సేయు
చుండి రక్కడ. ౪౬

కలకల నవ్వుచుఁ బెలుచం
బలుకుచుఁ దమకెలఁకులందుఁ బాంచాలకుమా
రులు సనుదేరఁగఁ బాండుసు
తులు వచ్చిరి సంతసంబుతో మడువునకున్. ౪౭

ఇట్లు వచ్చి ధర్మతనయుండు భవత్తనయమాయాస్తంభితం
బైనయాజలాశయంబు నిరూపించి తత్ప్రకారం బెఱింగించి
యచ్యుతునితో నల్లన నిట్లనియె. ౪౮

చొర రాదు మనుజులకు నె
వ్వారికిని నిజ్జలము కౌరవక్షితిపతి ని
ర్భరమాయాసంరక్షా
భరితం బై కాన వీతభయుఁ డాతండుర్. ౪౯

ధర్మరాజు మడుగున డాఁగియున్న దుర్యోధనుని దూఱనాడుట

అని వెండియు నాపతి గురు
జననాథుఁగుఱించి పలుకు శత్రుఁడు దోడై
చనుదెంచె నేని పోవ
చ్చునె నాచేఁ దప్పి యిందుఁ జొచ్చినఁ దనకున్. ౫౦

అనిన విని యచ్యుతుం డతనికి నల్పస్వరంబున ని ట్లనియె. ౫౧

మాయలు గల్గుదుష్టులకు మాయవుభంగులె మందు గాక ని
ర్మాయత నుల్లసిల్లెడుపరాక్రమలీలలు గొల్చునెట్లు దై
తేయులు దొల్లి మాయల నతిప్రబలాత్మకు లైనఁ దద్వధో
పాయములన్ జయింపరె నృపాలక విష్ణుఁడు నింద్రుఁడుం దగన్.

హిరణ్యకశిపువృత్రవధప్రకారంబులు వినవె రావణుండు హేమమృగాదిమాయాక్రియావిఘాతంబునఁ గాదె రాముచేత నిర్జింపంబడె నరకాసురు నేను బరిమార్చినతెఱం గెఱుంగవే వీఁ డగపడునట్టివిధంబు సూచికొ మ్మనిన విని యప్పాండవాగ్రజుండు జలాంతర్గతుం డై యున్నభవన్నందను నుద్దేశించి యి ట్లనియె. ౫౩

ఇటు తగునే సుయోధన మహీవలయంబున నిట్టిదైన్య మె
చ్చట వినఁ జూడఁ గల్గెనె యసంఖ్యులు రాజులు నీకుఁగాఁగఁ జ

చ్చుటయును బంధుమిత్రులు విశుద్ధచరిత్రులు పోర నట్లు త్రుం
గుటయును జూచి తేమిటికిఁ గ్రుంకితి నీళ్లకు జావు దప్పునే.
శూరుఁడవంచునిన్ మనువు సొచ్చుట శౌర్యముచొప్పెమాన మే
యూరికిఁ బోయె నాజి నృపు లోడుదురే నృపుఁడన్నమాత్రయే
కౌరవవంశజాతుఁడవు గష్టపుఁజచ్చుట దెచ్చుకొంటి నీ
పేరులు బెంపు మాలి యరిబృందము నవ్వఁగ నిట్లు సేయుదే.

క్షత్త్రధర్మంబు విడిచినఁ గలదె యిహముఁ
బరముఁ బేరోలగంబునఁ బలుకుపలుకు
లెల్ల మఱచితె విను మవి పొల్లులైనఁ
గష్టపాటు గాకను తేలఁ గావ వచ్చు. ౫౬

కొడుకులు దమ్ములుం గలన ఘోరపుఁజావులు సావఁ జూచి యె
ట్లోడఁబడె నీదుబుద్ధి యెడ లోముటకై నిను రాజరాజ యి
మ్మడువున కీడ్చి తెచ్చె విధి మానము ప్రాయముకంటెఁ జాల నె
క్కుడగుట సెప్పఁగా వినవొకో కడునీచతఁ బొంది తక్కటా.

అంభోగర్భము సొచ్చి పాండుసుతబాహోగర్వదుర్వారసం
రంభం బోర్వక డాఁగి యుండె నటె రారాజిస్సిరో చచ్చుచో
గాంభీర్యంబును ధైర్యముం విడిచి దోర్గర్వంబు బెండయ్యనే
శుంభన్మానము దూలెఁ గాకని జనస్తోమంబు నిందింపదే. ౫౭

కర్ణశకునిదుశ్శాసనుల్ ఘనులు గాఁగఁ
దలఁచి వారలఁ గొని మమ్ము గెలుచువాఁడ
వై మనంబున శంకింప కట్లు కీడు
చేసి తాపూఁవు దప్పిన గాసి యైతి. ౫౮

నీకొలంది గంటి మగపడితి వింక నెందుఁ బోవచ్చు నని మఱి
యు ని ట్లనియె. ౬౦

భయముం బాయఁగఁద్రోచి వీరగుణముం బాటించిసంగ్రామని
శ్చయబుద్ధిం దలకొల్పి పౌరుషముమైఁజూపాండెగల్పొందఁగా
క యధీరత్వము నాకు నీడె యని వీఁకం బేర్చి పేతాఁకు మెం
తయుఁ బేరయ్యెడు రమ్ము లె మ్ముదిఁగినన్ దైన్యమ్ము వ
చ్చుం జుమీ. ౬౧

అని మము నోర్చినం బృథివి యంతయు నేలఁగ వచ్చు లేక చ
చ్చిన సురపద్మసౌఖ్యములు చేకుఱు రెండుదెఱంగులందు నొ
ప్పనియది లేదుడాఁగనగుఁబాటునుబ్రాణముచేటుఁదెచ్చుకోల్
వినుమము నీ వెదుర్పఁ దగు వేయువిధంబులఁ జాటి చెప్పెదన్.

తెంపు చేసి మామీఁద నుఱుకుట నీకు ధాత నిర్మించినపరమ
ధర్మంబు పురుషుడం వై తేని దీని ననుష్ఠింపు మనిన విని యువ్వ
సుమతీశునకు సుయోధనుం డి ట్లనియె. ౬౩

దుర్యోధనుఁడు నీరిలోన యుండి ధర్మజునకు త్తరం బిచ్చుట

నరుఁడు ప్రాణభయంబుఁ బొరయుట యరు దయ్యె
వినుము తెల్లంబుగా మనుజనాథ
రథవాహసారథిరహితుండ నగుటను
బాణాది హేతిసంపదలు లేమిఁ
బరివారశూన్యత వాటిల్లుటను బంధు
మిత్రసహాయులు మిడి యడంగఁ
జచ్చుటఁ బోటుల నొచ్చి మేనును డప్పి
గూరి చిత్తంబును బోరి కెలయ

కునికిఁ జేసియుఁ దొలఁగితి నొదిఁగి సేద
దేర్చుకొని రణమునకు నుదీర్ణవృత్తి
వచ్చువాఁడను నీవు మీవారు విశ్ర
మింపుఁ డంతకు మఱి రండు సొంపు సూప. ౬౪

అని పలికినఁ బాండవాగ్రజుండు. ౬౫

ఇందాఁక విశ్రమించితి
మిందు నినుం దడవి కంటి మిప్పు డిచట నీ
కుం దేఱె డప్పి కురుపతి
నందన ర మ్మింక రణమునకు నాయిత మై. ౬౬

అనుటయు. ౬౭

ఎవ్వరికిఁ గాఁగ రాజ్యంబు నెల్లభోగ
ములును గోరుదు రక్కుమారులును నాదు
తమ్ములును లేరు తురగరథద్విపప్ర
హీన యయ్యె నీక్షోణియు నేల పెనఁగ.

ద్రుపదతనూజులన్ గెలిచి దోర్బలసంపద నుల్లసిల్లి మి
మ్మపజితదర్పహీను లగునట్లుగఁ జేసి సమస్తభూపతి
త్వపదము గంటినేమియు వృథారభసం బది యింపు గాదు క
ర్ణుపడుట భీష్ము లేమిని గురుండు మృతుం డగుటన్ ధరాధిపా.

తనవారుఁ దానుఁ గూడఁగ
ననుభవసుఖ మందఁడేని యది రాజ్యమె రా
జునకు భవత్పరిజనములు
ననుజన్ములు బ్రదికి యేలు మఖిలధరిత్రిన్. ౭౦

ఏ నింక సమర మొల్ల మ
హీనాయక నీక యుర్వి నిచ్చితి శాంతిం
గానకుఁ జని వల్కలపరి
ధానుఁడ నై తప మొనర్చెదను మునులకడన్. ౭౧

ఓడి వచ్చినాఁడ నుద్ధతి నా కేల
యుడుకు మాని నీవ యుర్వి యేలు
గుఱ్ఱములును నేనుఁగులు లేనిబయలు నీ
తలనె కట్టికొనుము ధర్మతనయ. ౭౨

అన విని యన్నరేశ్వరుఁడు హాసముతో నతనింగుఱించి యి
ట్లనుఁ దనుజానుజన్మసుహృదాప్తసహాయులు సన్నఁ గాదె శ
ల్యునిఁ గొని మమ్ము గెల్చి సకలోర్వియు నేలుట కుత్సహించి తీ
పనువుట లేల మానుమిది పాటిగఁ బట్టుము లెమ్ము పోరికిన్.

నీయీఁగి నేను భూనాయకుఁ డగు టొల్ల
రాజకోటికిఁ బరిగ్రహము సను నె
నిను నని దెగటార్చి నేలఁ బాలించెద
నను నోర్చితేని పెంపున సుఖింపు
మేమిటివాఁడ వై యిచ్చితి పుడమి నీ
కనియెడుమాట యిట్లాడె దిపుడు
నీవు ధరిత్రి యీనేర్చినఁ గురుకులం
బునకు ని ట్లాడుటఁ బోవ నేల
శాంతి నొందుటకై ధర్మ సంవిభాగ
కరణ మొనరింప వచ్చినకమలనాభు

వాక్యవృత్తిఁ బాటింపక వాఁడిసూది
మోపి నంతైన నుర్వి యీనోప నంటి. ౭౪

ఏమివిధంబునఁ బోరలియు
భూమి కురునృపాల నీకుఁ బుచ్చుకొనఁగ రా
కీమెయి దైన్యపడితి నా
కేమార్గము వట్టి యిచ్చె దేర్పడఁ జెపుమా. ౭౫

అరులకు సిరి యిచ్చెద నను
వెరవిడియుం గలఁడె దీని విడువుము నాకుఁ
ధర యిచ్చితేనియును నినుఁ
బొరిగొన కే విడువ నణిమి పోరుటయొప్పున్. ౭౬

నాచే నీప్రాణంబులు
నీచే నాజీవితంబు నిజ మున్నవి యి
న్నీచత యుపకార్యము రా
జోచితకర్మకృతనిశ్చయుఁడ వగుము నృపా. ౭౭

అని వెండియు ని ట్లను జతుగృహంబు దహించితి పాములం గఱపించితి నీటం ద్రోయించితి విషాన్నంబు వెట్టించితి వెన్ని కపటోపాయంబులు సేసినను నీచేతఁ జెడక యునికి యెఱుంగవే యింక నట్ల యుపాయములం బ్రయోజనంబు లేదు.

లే లెమ్ము బిరుద వైర
మ్మాలమునకు నీవు నెఱుఁగు దవ్విధము కదుఁ
మే లొందు తెరవు లే దిం
కేల రొమ్మొదిఁగి కష్టపడ నరేశ్వర చెపుమా. ౭౮

అని యివ్విధంబున నమ్మనుజేంద్రుండు మఱియుం బలుకఁ బెఱ
వారు నట్లు పలికి రనిన విని ధృతరాష్ట్రుండు. ౮౦

ఇట్లు జంకింపఁబడి మఱి యేమి సేసె
నాతనూజుండు మున్ను నెన్నఁడును జంకఁ
బడినవాఁడు గాఁ డక్కట పుడమినాల్గు
సెఱఁగులును వెఱఁ దనపంపు సేయ బ్రదికె. ౮౧

పరిజనహీనతదీనతఁ
బొరసినయెడ ముట్టుకొని రిపుప్రకరము ని
ష్ఠురవాక్యమ్ముల నమ్మొయిఁ
బరితాపము సేయ నేమిభంగి నిలిచెనో. ౮౨

అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లనియె నట్లు ధర్మ
తనయుండును దమ్ములుఁ గొడుకులును ద్రుపదపుత్రులును
బొదువుకొని పలుకుపలుకులకుఁ జిత్తం బుత్తలపడ నాననంబు
పల్లటిల్లఁ గరంబులు విదిర్చి దురం బొనర్చువాఁ డై యప్పాం
డవాగ్రజున కిట్లనియె. ౮౩

మీ రేవురును బరివారబాంధవమిత్ర
సహితుల రఖిలాస్త్రశస్త్రవంతు
లరు కరిస్యందనతురగసమేతుల
రే నొకరుండ విహీనసహాచ
రత్వంబు విగతాయుధత్వంబు వాహన
హీనత నొందితి నేవిధమున
నని యొనర్పఁగ వచ్చు నది గాక పోటుల
డస్సితిఁ గడు మీకు డప్పి లేదు

వరుసఁ దగ నొక్కఁ డొక్కఁడ వచ్చి పోరఁ
డిపుడ వెడలి మి మ్మందఱ నెల్లచెలులఁ
జుట్టముల రూపుమాపెదఁ జుట్టుముట్టి
పలువు రొక్కనితోఁ బోరఁ బాడి యగునె. ౮౪

అట్లు మీఱు సాలరేసి. ౮౫

తమ్ముల నిన్నుఁ గేశవునితమ్ముని ద్రౌపదియన్నదమ్ములం
గ్రమ్మన గీటడంచెద నొకండన యే నిదె వచ్చి బాహుద
ర్పమ్ముల నిర్గవారమును భానుఁడుఁ దోఁచి సముజ్జ్వలాత్మ తే
జమ్మున రూపుమాపుక్రియ సజ్జత నిల్వుము సుస్థిరుండ వై.

వినుము నీకుఁ గృష్ణునకును వెఱచి కాదు
ముంద రే నట్టు లాడుట యెందుఁ జెల్లు
సమరధర్మంబు తెఱఁగు దెల్లముగ నెల్ల
వారలకుఁ దెల్పుటకుఁగాని వసుమతీశ. ౮౬

నేఁడు మి మ్మందఱ సమయించి భీష్మద్రోణకర్ణభగదత్త
బాహ్లికజయద్రథశకుని శల్యాదు లగుబంధుమిత్రసహాయుల
ఋణంబు దీర్చెద నని పలికినం బాండవాగ్రజుం డిట్లనియె.

సమరముపాడి నీ వెఱఁగి శత్రుల గెల్వఁగ నుత్సహించు టొ
ప్పు మనుజనాథ యొక్కఁడును బూని మహాద్భుతబాహుసంపద
మ్మము వడిఁ దాఁకెదం బిలుకుమార్చెద నంటయుదాత్తమైనధై
ర్యమహిమ గాదె యి ట్లనినయంతన యే నటు తేలచేసెదన్.

వలసినయస్త్రశస్త్రములు వాహనముంగొను మొక్కరుండ నిం
గలన జయించువాఁ డతనిగర్వము నీ వడఁగించితేని యీ
యిల సకలంబు గైకొని వహింపుము రాజ్యవిభూతి వాఁడు నిం
దలపడి పోరుఁ జుట్టలును దక్కటివారలు నిల్చి చూడఁగన్.

అనిన విని భవన్నందనుండు ధర్మనందనున కి ట్లనియె. ౯౧

అరదము లెక్కి ఘోరవివిధాస్త్రచయంబుల మున్ను పోరమే
నరవర క్రొత్తచందమురణంబు కరంబు ప్రియంబు సేయు ని
ష్ఠురగదలం బదాతు లయి శూరతయుక్తి మహానీయధీరతా
స్ఫురణమునం బొగడ్త వడఁ బోరుట మే లని నిశ్చయించితిన్.

వింతకూరలు గుడుపున వేడ్క సేయు
భంగి సంగ్రామమున నూత్నభంగు లెడఁదఁ
గౌతుకము సేయుఁ గావున గద ధరించి
నిను సహోదరులను యోధులను జయింతు. ౯౩

అనుటయుఁ బొంగి ధర్మసుతుఁ డాతనితో గద నొక్కరుండ నేఁ
గొనియెద నీదుప్రాణము లకుంఠితబాహువిలాసభాస నై
యనవుడుఁ బుట్టలోపలిమహాభుజగేంద్రుఁడు రోఁజునట్లు రోఁ
జె నధిప యవ్విభుండు దనచిత్తము నప్పలుకుల్ గలంచినన్.

దుర్యోధనుఁడు గదామండితుం డై హ్రదంబు వెడలివచ్చుట

అట్లు నిశ్వాసంబు నిగుడ నొడలు పొంగఁ బటుకశాఘాతంబు
నం గెరలుశూకలాశ్వంబుచందంబునఁ గెరలి జలస్తంభం బుడి
పికొని మడువు సంక్షోభింప నపహసితశిలాసారోదారంబును

గనకపట్టికామండితంబును నై నగదాదండంబు విపులాంసపీఠం
బున నమర్చుకొని వెడలె నట్లు సంరంభవిజృంభితుం డై. ౯౪

గదయుఁ దానును రుచిరశృంగమునఁ బొల్చు
పర్వతము క్రేణి సేయుసీపట్టిఁ జూచి
కాలదండంబు చేకొని లీలఁ బొల్చు
జమునిఁ గా మదిఁ దలఁచిరి జనము లెల్ల. ౯౬

అతనిఁ గనుంగొని పాంచాలురును బాండవులును. ౯౭

చిఱుతనగవుతోఁ గొండొకరుచేతు లప్ప
ళించి నిర్భర సంతోషలీల నొప్పి
రమ్మహీనాథుఁ డయ్యుపహాస మెఱిఁగి
బొమలు ముడివడఁ గనుఁగవఁ బొడమఁ గెంపు. ౯౮

కోపావేశంబు నొంది యుద్వృత్తతారకంబుల వారల నెల్ల
నాలోకించి. ౯౯

ఈ గెలి వే లార్చెద బా
హాగర్వము మెఱయ మిమ్ము నందఱను మహీ
భాగమునఁ గూల్చి నెఱపెద
నాగదబలు పెట్టు లైన నగుఁ డంబాఁకర్ణా. ౧౦౦

అనుచుఁ బోటులఁ దొరుఁగురక్తాంబుధార
లంగ మెల్లను గప్పిన నప్పు డొప్పెఁ
గావిసెలయేఱు లెల్లెడఁ గలయఁ బర్వఁ
బొలుచుకులపర్వతంబుచాడ్పున నతండు. ౧౦౧

అట్లు ఘోరాకారుం డై నిలిచి నీకొడుకు పాండురాజుకొడు
కులు బంధుమిత్ర పరివారసమేతంబుగా నడరి యొక్క పెట్ట
తన్నుం బొదువుదు రని శంకించి పాండవాగ్రజు దెసఁ గనుంగొని.

రండిట యొక్కఁడొక్కఁడ దురం బొనరింపఁగ మీరు పల్వురొ
క్కండను నేను హేతిహతకాయత దస్సినవాఁడ నన్ను నా
తం డభిమన్యు బాలుని నధర్మతఁ బ్రౌఢు లనేకయోధు లొ
క్కం డన కెట్లు చంపి రటు గాఁ గొను మిబ్బవరంబు నావుడుఁ.

నిరుత్తరుం డై యున్నభవత్తనయునకాధర్మతనయుం డిట్లనియె.

ఏ నట్లు సూపి చెప్పితిఁ
గాని యది రణంబుపాడి గామి యెఱుఁగుదుఁ
రా నీను నీదుపయి మ
త్సైనికులను వెఱవ కాయితము గమ్ము నృపా. ౧౦౫

తల సక్క ముడిచికొని ద్రిం
డలవడ బంధించి పోరి కమరి నిలువు నీ
వలచిన యట్టివ యిచ్చెద
నలఘుశిరస్త్రాణకంకటాదులు నెమ్మిన్. ౧౦౬

మఱియు నొక్క తెఱంగు నీమనంబున మెచ్చును నచ్చెరువును
నెలకొనం బలికెద నాకర్ణింపుము. ౧౦౭

ఏఱికొను మీవు నొకని మాయేవురందు
వాఁడు నీతోడఁ దగఁ బోరువాఁడువానిఁ

జంసి మహి యేలు వానిచేఁ జచ్చి త్రిదివ
సౌఖ్యమొందుము చేసితి సమయ మేను. ౧౦౯

అని పలికి యుజ్జ్వలవివిధవర్ణంబు లాతనిముందటం బెట్టించి.

విను జీవముతో నిన్నుం
జననిచ్చుట యొండు దక్క సమరంబునఁ గో
రినయది నీ కొసఁగెద నిం
తన చెడియెనె యకట యన్నదమ్ములకూర్మిల్. ౧౧౦

అనిన విని నీతనయుం డట్లు కాక నీవు నా కలిగెదవే యని కనకచిత్రితంబు లగుశిరస్త్రాణకంకటంబులు గైకొని ధరియించి కాంచనాచలంబు ననుకరించుచు గద చేత నమర్చి పాండవాగ్రజుం గనుంగొని. ౧౧౧

కవలలో నొకఁ డొండె గాండివి యొండె వృ
కోదరుఁ డొండె నీవొండెఁ జేత
గద గొని యెక్కటికయ్యంబునకుఁ బూని
యేర్పడ నిలిచిన నీక్షణంబ
సమయుంగఁ జూచెదఁ గ్రమమున మీ రెల్ల
నొకఁ డొక్కఁ డేతేరఁ బ్రకటబాహు
దర్పంబు వొగ డొంద ధరఁ గూల వ్రేయుచు
వచ్చెద మఱియు నీవారిలోన

నలిగి యెవ్వఁడు దాఁకిన నట్ల నాదు
గదకు నెర సేసి పేర్చెదఁ గడు గదార

ణంబు నాతోడఁ జేయ మన్మథహరుండు
గడఁగ లేఁడు మీ కెందుఁ బోఁ గలదు నేఁడు. ౧౧౨

ఇవ్విధంబున దుర్యోధనుం డుద్ధతుం డై మఱియుం బెద్దయెలుం గునఁ బలుకుచుండ నతండు విన కుండఁ బద్మనాభుండు పాండ వాగ్రజున కిట్లనియె. ౧౧౩

ఇతఁడు గదారణంబునకు నీకొలఁదిన్ నినుఁ బిల్చెనేని మరు
త్పుత్రిసుతుఁ గోరినం జిఱుతతమ్ములలో నొకనిన్ వరించినన్
మతి సెడి రొక్కొ వీర లనుమాటకుఁ బాత్రము గాదె సాహసం
బుతఱియె మేదినీశ యిది బుద్ధి దొఱంగి తనుగ్రహంబునన్.

ఒకరునిఁ జ్వపి తేని సకలోర్వియుఁ గ్రైకొను మంట నీవు ముక్
శకునికి మాయజూదమున సంపద లెల్లఁ ద్రయోదశాబ్దభో
గ్యకృతి నమర్చి యొడ్డినటు లైనది పందెపుఁగయ్య మయ్యె శ
త్రుకులము నెల్లదుఃఖపడి త్రుంచుట దాఁ దుదిఁ బందెమాడనే.

నరవర యొక్క టెక్కటి పెనంగఁగ భీముని నైనఁ బన్పఁ గా
దరయఁగ భీముకంటె గదయందలికౌశల మెక్కుడీమహీ
శ్వరునకు భీముమేన బలసంపద మిక్కిలి దానఁ బోవునే
వెరవునఁ గోలుపోదె భుజవీర్యము పోరుల నెందుఁ జూడమే.

అనిన విని మహాబలనందనుండు వసుదేవనందనున కిట్లనియె.

శ్రీకృష్ణుఁడు భీము నగ్గించి దుర్యోధనుతోడి గదాయుద్ధమునకుఁ బనుచుట

గద నాచేతికి వచ్చినప్పుడు మహోగ్రక్రీడమై లోకము
ల్పదునాల్గున్ సమయింతుఁబొమ్మనుసముల్లాసంబునన్పొందుదు

ర్మదసంరంభ వికత్థనుం డయినకౌరవ్యాధముం డెట్లు నా
కెదురై ప్రాణముతోడఁ బోవు నృపు నిక్లే లొత్తెదీమాత్రకున్.

వానిగదభారమునకు నొవ్వకయు నాడు
పటుగదాదండ ముద్దండబాహుదర్ప
లీల విలసిల్ల వ్రేయుదు నేలఁ గూల
సంతసముతోడి మెచ్చు పుట్టింతు నీకు. ౧౧౯

అనుటయు నచ్యుతుండు ప్రియం బెసంగ నాకిమ్మారమగ్గను
మొగంబునఁ జూడ్కి నిలిపి. ౧౨౦

బకవిధ్వంసన మాచరించితి హిడింబప్రాణముల్ గొంటి కీ
చకనిర్మూలనకేలి సల్పితి జరాసంధాంగక స్పైరభం
జకలీలన్ విలసిల్లి తీ వని మనుష్యస్ఫూర్తిమాత్రంబులే
రొకమర్త్యుం డెదు రెట్టు నీకు మదిలో నూహింపకిట్లాడితిన్.

కాళింగాదిక్షోణీ
పాలుర నున్మదమహోద్విపప్రకరములన్
నేల నిడి కాలఁ జమరితి
వాలినకురునృపకుమార వర్గంబులతోన్. ౧౨౨

అని పలికి కురుపతిదెసఁ గటాక్షవీక్షణంబు నిగుడ వెండియు,

వాలి దుశ్శాసనునిఱొమ్ము వ్రయ్యఁ జీరి
నీవు నెత్తురు ద్రావంగ నిన్ను నతఁడు
సూచుచుండియు వెఱ సొచ్చి స్రుక్కెఁ గాక
కవియఁ జాలెనె నీపయిఁ బవనతనయ. ౨౧౪

అగపడి కచ్చ వెట్టి యుతఁ డాడినమాటల కిప్డుబల్లిదుం
డుగఁ గొని యేను బల్విరుఁ గదుక వడి నీతనిఁ జంపకుండ నే
మిగ సహయుంబు సేసి తది మేలొకొ యంటి నృపాలుతోడనీ
మగఁటిమిచందముల్ దలఁచి మారుతనందన యూఱడిల్లితిన్.

తులువతనంబునక సభకు ద్రోవది ముందల వట్టి యీడ్చి య
ట్లలఁపఁగఁ జూచి నీవు దగ నాడిన రెండుదెఱంగులందుఁ బెం
పొలయఁగ దుస్ససేనుపని యొక్కటి దీర్చితి తీర్పు మింక బా
హులకసి వోవ నీనిపనియుం ద్విరితక్రమవిక్రమంబునక. ౧౨౭

పరజయము నొంది కట్టము పట్ట మఖిల
ధరణిరాజ్యంబునకు ధర్మతనయుఁ బ్రీతి
బంధులకు నెల్లఁ గన్నులపండు వగుచు
నీవుఁ దమ్ములు సుఖవృత్తి నెలవుకొనుఁడు. ౧౨౮

అని మఱియును. ౧౨౯

బరవస మొప్ప నీవు గదపండువు సేయఁ దలంచి తాఁకినం
గురుపతి నిర్జితుం డగుటకుం బవనాత్మజ యేను బూఁట పో
టరితన మెల్లఁ జూపుము కడంగుము నీ వని యేలిమాటమై
నరవర ధర్మసూనుఁడు వినన్ విజయుం బొసఁగెన్ మఱందికిన్.

ఇవ్విధంబున వృకోదరునకు జయప్రదంబు లగుమాట లాడి
దుర్యోధనుండు దండిమగండు శ్రమంబునుం జాలఁగలఁడు నీ
వతిప్రయత్నంబునఁ బెనంగవలయుఁ జుమ్మీ యని పలికె న
ప్పుడు సాత్యకి యాసమీరనందను నగ్గించెఁ బాంచాలురుఁ

దక్కనుంగలుగుధరణీశులు సబ్బలుమగనిఁ బ్రశంసించి రతం
డగ్రజునాననం బాలోకించి. ౧౩౦

వినుము నరేంద్ర యేను బలవిక్రమయుతుల్ వొగడొందు నిక్కల
ఘ్నునిపయి నామనంబు నతికోపము పార్థుఁడు ఖాండవంబునం
దనలము పర్వఁ జేసినటు లగ్గలికన్ నిగిడించెదన్ గదం
గొనియెదఁ బ్రాణముల్ మహి యశుంతితశాస్త్రి గ నేలు మం
తయున్. ౧౩౧

మహితకీర్తి పుష్పమాలికఁ బూన్చెద
నిన్నుఁ జీకురాజు నేఁడు నసరుఁ
గాక శకునిబుద్ధికతమునఁ దమ కింత
పుట్టె నని తనూజుపాలియు నెఱిఁగి. ౧౩౨

అని పలికి సన్నాహంబు శోభిల్లు చుండ గదాదండంబుఁ గేల
నమర్చి వృత్తుని నభిముఖుం డగువాసవుండునుంబోలె దుర్యో
ధనుదిక్కు మొగం బై నిర్వ్యూహం బైన శుండాలంబు
చందంబున నున్న యన్నరపతిఁ గనుంగొని తమయన్నయుఁ
దమ్ములు నెమ్మనంబుల సంతసిల్లఁ దాను సమరోల్లాసభాసితుం
డగుచు నతని కి ట్లనియె. ౧౩౩

ఇట్టిది క్రూరకర్మ మని యించుక కొంకక లక్కయింటఁ జి
చ్చొట్టితి మాయజూదమున నుత్తమధర్మజుఁ దూలఁబుచ్చితా
చుట్టలుఁ బెద్దలుం జెలులుఁ జూడఁగ ద్రోవది భంగపెట్టితి
ట్టటన కింకఁ దత్ఫలము లన్నిటి నొందుము చేరి తగ్గ మైఁ. ౧౩౪

గాంగేయకుంభజకర్ణశల్యాదులు
నీకుఁ గాఁ బెనఁగి యనేకబంధు
మిత్రులు మడిసిరి ధాత్రీపతులఁ దోడు
తెచ్చితి పలువురఁ జచ్చి రంత
వట్టువారును దోడఁబుట్టువు లెల్లను
గూలి రంతటికిని మూలమైన
శకుని గీటడఁగె నింకొకరుఁడ వీవున్న
వాఁడవు విను నిన్ను నేఁడు నాదు
గదకు నెరసేసి లోకంబు కల్మషంబు
లేను బాపెద నీరజ్జు లేల నాకుఁ
జక్కనైన రమ్ము మద్భుజాస్తంభశుంభ
దుగ్రకేళికిఁ బాత్రమై యోట దక్క. ౧౩౫

అనుడు నెదిర్చి నీతనయుఁ డాతని కిట్లను నేల రిత్తగ
ర్జనములు గావవే పటుభుజాకలితోగ్రగదాసముద్భటుఁ
నను నిటు రమ్ము సూపుము రణంబున నీదుబలంబుఁ జేవయుఁ
మన మిటు చేరి నిల్చి వెడమాటల నాడుచు నున్కి యొప్పునే.

వినుము గదారణమున నను
జెనయఁగ వాసవున కైనఁ జెల్లదు నీ వీ
యనిఁ బాడి దప్ప కుండఁగఁ
బెనఁగుము ప్రాణంబుతోడఁ బ్రిదిలెదు భీమా. ౧౩౬

అనిన విని పాంచాలురం దక్కినజనపాలురుం బ్రశంసించి
మత్తమాతంగంబుఁ దలశబ్దంబుల నుబ్బ జేయునోజ రారాజుఁ

బ్రహర్షంబు నొందించిరి గజబృంహితంబులు హయహే
షితంబులును జెలంగె నాయుధంబు లెక్కుడు మెఱుంగులఁ
బొలిచెఁ దదనంతరంబ యెల్లవారును నెడ గలుగఁ గూర్చుండి
రమ్మహావీరులు దలపడువారై వీరోద్రేకంబునం జేసి యతి
లోకం బగునవష్టంభంబున విజృంభించి యొండొరుల నవలో
కించి రట్టియెడ. ౧౩౭

భీమదుర్యోధనుల గదాయుద్ధము సూడ బలరాముఁడు వచ్చుట

యదుకులదీపకుం డగు రాముఁ డవ్వార్త
యంతకమును విని యక్కుమారు
లాత్మశిష్యులు గాన నాహవ మీక్షింపఁ
దీవ్రయానమున నేతెంచి దృష్టి
గోచరుం డగుటయుఁ గురునాథ తగ నెల్ల
వారు నెదుర్కొని గారవమునఁ
బ్రణమిల్లిన నతండు ప్రత్యభివందన
మాచరింపంగ ధర్మాత్మజుండు

సమ్మదంబునఁ బరిరంభణమ్ము సేసె
నరుఁడుఁ గవలును ద్రౌపదీనందనులును
వందనం బొనరించిరి వారి నాతఁ
డర్హభంగి భాషణముల నాదరించె. ౧౩౮

హరియును సాత్యకియు వినయ
భరితాంతఃకరణు లగుచుఁ బ్రణతు లయిన న

య్యిరువురను గ్రుచ్చి బెరయం
బరిరంభణ మాచరించెఁ బరమప్రీతిఁ ౧౮౦

ఇత్తెఱంగున నెల్లవారలు నాబలదేవునిఁ గాంచి కుశలసంప్రశ్నంబు సేసి రయ్యాదవపుంగవుండు సదుత్తరం బిచ్చి యేను బోయి పెక్కుదినంబు లయ్యె నని యుగ్గడించి మిమ్ము నిందఱను జూచుటకును నాశిష్యుల గదాయుద్ధం బనుసంధించుటకును వచ్చితి ననియె నమ్మరుత్సుతుండును భవత్సుతుండును గదలు సేతులన యుండ నతనిఁ జేరి భక్తిం బ్రణామంబు లాచరించిన నతం డాదరించె నంతఁ గౌంతేయాగ్రజుండు రౌహిణేయుతో నన్నదమ్ములయిరువుర యొక్కటి పోరు సూడ మని పలికి వా రట్లు ద్వంద్వయుద్ధంబునకు సన్నద్ధులైన తెఱంగెఱింగించిన నతండు లెస్స కాక యని యనుమతి సేసె నని సంజయుండు ధృతరాష్ట్రునకు రామునాగమనంబు సెప్పె ననిన విని తదీయప్రవర్తనశ్రవణకుతూహలాయత్తచిత్తుండై నజనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. ౧౮౧

ఉభయవాహినిసంగరోద్యోగసమయ
మున హలాయుధుఁ డేతెంచి మురహరుండు
పాండురాజసూనులయెడఁ బక్షపాతి
యని విరాటాదిబంధులు వినఁగఁ బలికె. ౧౮౨

హరి యెఱుఁగనిచక్కటియును
బురుషార్థము నా కెఱుంగఁ బోలునె యాని

స్ఫురత వినఁ జూడఁ జాలక
సరస్వతీతీర్థమునకుఁ జనియెను బుద్ధిన్. ౧౪౩

మా కెఱింగించి పో వచ్చితిఁ బోయి వచ్చెద నని వాసుదేవ ధర్మజు లాడఁబడి యనుపఁ జనియె నని వింటి బలదేవుండు తీర్థయాత్ర నిర్వర్తించిన తెఱంగును భీమసుయోధనుల గదాయుద్ధంబు చెల్లినభంగియు నతనికాలోన నచటి కేఁగుదేర సమకూఱినవిధంబును వివరించి చెప్పు మనిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. ౧౪౪

వినుము నరేంద్ర యవ్విధమునఁ జని యమ్మ
హాత్ముండు గోసువర్ణాదు లైన
దానార్హబహుపదార్థంబులు దనయగ్ని
హోత్రంబు దెచ్చుట కుచితజనులఁ
బుచ్చె ననేకవిప్రుల నాప్తసచివుల
వలయురథద్విపాశ్వములగముల
రావించెఁ దండులప్రముఖభోజనసాధ
నములు సంపన్నహృద్యములు గాఁగఁ
దేరఁ బనిచె నిట్లు తీర్థయాత్రాసంవి
ధాన మాచరించి మాననీయ
మగుసరస్వతీమహాంభోధిసంగమ
స్థానమునకుఁ జనియె సవినయముగ. ౧౪౫

అది ప్రభాసం బనుపేరం బరఁగు నట్లందులకుఁ జని తీర్థ
సేవనం బనుష్ఠించి యంతనుండియుఁ బథిశ్రాంతి ప్రయాణం

బుల సరస్వతీచేరువ నడచి తదీయసకలతీర్థంబు లాడుచు నన్నపానంబుల నాసనశయనయానంబులను ధేనుకనక రత్నాంబరాభరణాది ద్రవ్యంబులను విప్రుల నతిప్రీతులఁ జేయుచు బాలవృద్ధ వనితావికలాంగదుర్బలప్రాయులఁ బరిశ్రాంతులైనవాడలం దడిమికొని యభీష్ట ప్రకారంబుల శరీరస్థితి నడపింపఁ దగువారి నియోగించి మఱియు ననేకధర్మంబు లాచరించుచుఁ గురుక్షేత్రంబునకు వచ్చె ననుటయు జనమేజయుం డాతీర్థ విశేషంబులు వివరించి చెప్పు మనుడు వైశంపాయనుండి ట్లనియె. ౧౮౬

మును చనియెఁ బ్రభాసమునకు
నని చెప్పితి నతని నది మహోత్తరతీర్థ
మ్మున నరేంద్ర యందుఁ జంద్రుఁడు
దనయక్ష్మం దీర్చుకొని గతవ్యథుఁ డయ్యెన్. ౧౮౭

ప్రభాసతీర్థప్రభావర్ణనము

అత్తెఱం గెఱింగించెద దక్షకన్యకల నశ్విన్యాదు లగుసప్తవింశతిసంఖ్యలఁ జంద్రుండు వివాహం బయ్యె నందు రోహిణి రూపాతిశయవతి యగుటం జేసి తదాసక్తుం డై నఁ దక్కటివారు వగ నొంది తండ్రికడకుం జని చంద్రుని యన్యాయం బెఱింగించిన నాప్రజాపతి చంద్రునితో నుగ్గడించి యది చాల నధర్మం బింక నిట్లు సేసి తేని శపింతుఁ జుమ్మీ సముఁడవై వర్తింపు మనుటయు నమ్మాట దెస ననాదరంబు సేసి యతండు వెండియుఁ దొంటియట్ల వర్తించిన నెఱింగి

యమ్మహాత్ముండు గోపించి యతఁడు దెవులు గొను మని శాపం బిచ్చిన నయ్యోషధినాథుండు నానాటికిఁ గృశుం డయ్యె నట్లు తెవులుచేత నతండు పోఁడిమి మాలిన నోషధులు పసచెడియె దానఁ బ్రజలు దైన్యం జొచ్చి రది చంద్రకార్శ్యహేతుకం బగుట యనుసంధించి. ౧౪౮

దేవత లమృతాంశునితో
నీ వేటికిఁ గృశుఁడ వైతి నిక్కము చెపుమా
నావుడుఁ దనదెఱఁ గేర్పడఁ
గా వారికి నతఁడు సెప్పెఁ గౌరవముఖ్యా. ౧౪౯

విని వార లతనిఁ దోడ్కొని
చని ప్రార్థించుటయుఁ దగఁ బ్రసన్నుం డై యి
ట్లను దక్షుఁ డఖిలభార్యా
జనులయెడన్ నడవవలయు శశి సమవృత్తిన్. ౧౫౦

అట్లు నడచుచు సరస్వతీజలనిధిసంగమకలితం బైనతీర్థంబు జలంబుల నిమగ్నుండై వృద్ధిఁ బొందు వరుసన పదియేనుపది యేనుదినంబులు సంక్షయంబును బ్రవర్ధనంబు నొందం గల వాఁ డని చెప్పె వెండియు. ౧౫౧

అమవస నమవస నాతీ
ర్థమునఁ గృతస్నానుఁ డై సుధాకరుఁడు ప్రవృ
ద్ధిమహితతనుఁ డగు నని యతఁ
డమరుల వీడ్కొల్పి యామృగాంకునితోడన్. ౧౫౨

వనితలకు విప్రులకు నవమానంబు సేయకుమీ యని పలికి వీడ్కొలిపె నట్లు శాపమోక్షంబు గని చంద్రుం డా తీర్థంబునకుఁ జని తదీయజలస్నానంబున నాప్యాయితశరీరుం డై లోకపరిభాసుం డయ్యె నది గారణంబుగా నాతీర్థంబు ప్రభాసం బను పేరం బ్రసిద్ధి నొందె నం దుండి యారోహిణీ నందనుం డరిగి చమసోద్భేదనం బనుతీర్థంబున నొకరాత్రి వసియించి యుదపానంబునకుం బోయె దానివిశేషం బాక ర్ణింపుము. ౧౫౩

త్రితుఁ డనఁగా ద్వితుఁ డన నే
కతుఁ డనఁగఁ దపస్విసుతులు గల రావిప్ర
త్రితయము భూపాలురకును
గ్రతుదీక్ష లొనర్చి ధేనుగణముల్ వడసెన్. ౧౫౪

వడసి యొక్కట్ల చేతెంచునెడ నయ్యేకతద్వితులు నిజభ్రాత యగు త్రితుని వంచించి తా రాగోవులఁ దోలంగ నడిచి కొనిపోవువారుగాఁ బాపబుద్ధి నుత్పాదించి రాసమయంబునఁ డెరువున నొక్కవృకం బున్నఁ దద్భయంబునం దోలంగం బోయి ప్రమాదంబునఁ ద్రితుం డను నూతం బడిన నయ్యిరువురు నతని నుపేక్షించి ధేనువులం గొనిపోయి రమ్మునికుమారుండు నిర్జలం బైనయయ్యుదపానంబున నుండి సోమపానంబు సేసినం గాని యీదురితంబు వాయ దని తలంచి యజ్ఞసాధనంబునకుఁ బ్రతివిధులు సంకల్పరూపంబున సంపాదించికొని క్రతు వొనరించిన దేవతలు సన్నిధి సేసి హవిర్భాగంబులు

గై కొనిరి సరస్వతీజలంబు తత్కూపంబున నుద్గతం బై యాస
వనపతి నుద్ధరించె నయ్యమరులు వరం బడుగు మనిన నమ్మ
హాద్విజుండు. ౧౫౫

వినుఁ డుపస్పర్శ మిందుఁ జేసినయతండు
వడయువాఁడు మహితసోమ నానఫలము
వరము నా కిది యనుటయు వార లట్లు
లవుట సంప్రీతిమై నిచ్చి దివికిఁ జనిరి. ౧౫౬

అట్టియయ్యుదపానంబును సేవించి వినశనంబునకుఁ జనియెఁ
దత్తీర్థంబు హీనజాతులకుఁ బొడసూపక నశించుఁ గావున విన
శనం బనం బరఁగె మఱియు భూమికంబునకుఁ బోయె నది
యప్సరోగీతనృత్యవిహారభూమి యగుట భూమికం బనఁ బ్రసి
ద్ధం బయ్యెఁ బదంపడి గంధర్వతీర్థంబునకు నేఁగె నది విశ్వావ
సుప్రభృతిగంధర్వతపస్సిద్ధస్థానం బందుండి గర్గస్రోతంబునకుఁ
జనియె నందు గర్గుండు సన్మునిసేవితుం డై చిరకాలంబు వసిం
చె నచ్చోటు గదలి యాబలభద్రుండు. ౧౫౭

వినుము శంఖతీర్థమునకు నై సర్గిక
ౘునకు నాగధన్వమునకు వరుసఁ
జనియె నాగధన్వ మనునది వాసుకి
స్థాన మచటఁ దొల్లి సకలసురులు. ౧౫౮

నాగేంద్రత్వమునకు వాసుకి నభిషేకించి రందుండి యా
నీలాంబరుండు నైమిశంబున కరిగె నయ్యెడం దొల్లి సరస్వతి
యనునేఱు దూరం బై యుండ నైమిశారణ్యవాసు లగు

మునులు క్రతువు సేయం దొడంగిన నాసరస్వతి వారల
సంభావించుటకు మఱంగి పాఱినకతంబునం దటసమీపం
బయ్యె నవ్విశేషంబు విని విస్మితుం డగుచు నాహలాయుధుం
డాతీర్థంబుఁ గొనియాడి సప్తసారస్వతంబునకుం బోయె
నచ్చట మంకణుం డనుమహాముని వసించుఁ దొల్లి నలిన
భవుసత్త్రంబున నైమిశారణ్యమునులయాగంబున గయుని
క్రతువున నుద్దాలకునధ్వరంబున వసిష్ఠునసత్త్రతంతువున గు
రునిసవనంబున వెండియు నొక మఱి యాపరమేష్ఠియజ్ఞం
బున హిమవత్పుష్కరాదు లైనతత్తత్ప్రదేశంబులకు సుప్ర
భయుఁ గనకాక్షియు విశాలయు సురతన్వియు నోఘమా
లయు సువేణియు విమలోదకయు ననునామంబుల నారీవేష
యుక్త యై సరస్వతి చని యజమానసకలదేవమునిసంభావన
వడసె నట్టిసప్తాకారంబుల నాసంయమియాశ్రమంబునఁ బ్ర
వర్తించుట నది సప్తసారస్వతం బనం బరఁగె నమ్మంకణునిచరి
తంబులు మఱియునుం గల వాశ్చర్యకరంబులు వినుము. ౧౫౯

### మంకణమహామునిమహాత్మ్యాభివర్ణనము

అతఁడు సరస్వతి నవగాహనము సేయు
చుండి యాచేరువ నొర్తు తడుపు
గట్టక నీళ్లాడఁగాఁ జూడఁ దనదు శు
క్లము నిర్గమించిన ఘటసురక్షి
తము సేయ సప్తభేదము లొంది యది సప్త
ఋషు లైరి వారు మరుద్గణంబు

నకు సంజననకారణం బైరి వినుమొక్క-
నాఁ డత్రితపస్వి వ్రేల్కోటి దర్భ
గంటె, గూఁరయసరు గాఱిన నర్తించె
నతఁడు తపముసిద్ధి కాత్మఁ బొంగి
జగము లెల్ల దాన సంక్షోభ మొందె ని
ర్జరులు భీతిఁ జనిరి శంభుఁ గాన. ౧౬౦

కని యంతయు నెఱింగించిన నద్దేవోత్తముం డాభూదేవోత్త
ముపాలి కరిగి యిది యెంతటి విశేషంబు దపంబు లిట్టివే నర్తిం
చుట మాను మని పలికి తన యంగుటంబు వ్రేలం గీఱిన
నందు భస్మంబు గాఱిన నాసంయమి సిగ్గు పడి దండప్రణామం
బు సేసి. ౧౬౧

దైవ మెల్లఁ దలఁప నీవ సమస్తజ
గంబులకును నేడుగడయు నీవ
కర్మఫలదుఁడవును గర్మప్రదుండవు
నీవ కరుణ నన్నుఁ గావు మభవ. ౧౬౨

అని వెండియు ననేకప్రకారంబులం బ్రశంసించినం బ్రసన్నుం
డై పశుపతి యతనికిఁ దపఃప్రభావం బక్షీణంబు గా వరం
బిచ్చి చనియె నమ్మహాముని నృత్యంబు మానిన జగంబుల
సంక్షోభంబు శాంతం బయ్యె నట్టియమ్మహాత్ముని నివాసం
బైనసప్తసారస్వతంబుననుండి యాసీరి యౌశనంబునకుం బో
యె వినుము తొల్లి రఘురామునిచేతఁ జచ్చినమహోదరుం
డనునసురతలపునుకయొక్క- తపస్వికాలఁ దగిలి పుచ్చ రా

కున్న నతండు వేదనం బొందుచుండం గని యార్యులు సర
స్వతి నాశనం బనుతీర్థంబు శుక్రుండు దపంబు సేసినచో
టందుఁ బొమ్ము నీదురితంబు వాయు ననిన మహోదరనా
మధేయుం డగు నా సంయమి యచ్చటికిం జనినఁ గపాలంబు
ముక్తం బయ్యె దానం జేసి యది కపాలమోచనం బనం
బరఁగు నచ్చోటు వదలి పృథూదకంబునకుం జనియెఁ దదీయ
విశేషంబు వినుము గాధి యనుమహారాజుకొడుకు విశ్వామి
త్రుం డనునతండు. ౧౬౩

తండ్రియట్ల సకలధాత్రీశుఁ డై యుండి
దనుజమథనమునకు దండు వెడలి
యరుగు నెడ వసిష్ఠునాశ్రమంబునపొంత
విడియఁ బరిజనములు వినయ మెడలి. ౧౬౪

అందు దుర్నయంబు లాచరించిన నమ్ముని కోపించి నిజహో
మధేనువు నాలోకించి నీబలంబు పనుపు మనిన నది దనమా
హాత్మ్యంబున నచట నావహిల్లినఘోరాకారు లగువీరులఁ
బనుప వార లారాజువరూథిని మడియించిన శేషించిన జనం
బులు పలుగడలం బాఱి రట్లు దురవస్థం బొందునాసేనం జూచి
యగ్గాధినందనుం డెల్లశక్తులకంటె దపశ్శక్తి యెక్కు డగుట
యెఱింగి యాపృథూదకంబునఁ దపంబు సేయుచుండ దానికి
దేవపతి విఘ్నంబు సేయ మఱియు నియమనిష్ఠుం డై బ్రహ్మ
చేత బ్రాహ్మణ్యంబును బడసె నత్తీర్థంబుననుండి బలభ
ద్రుండు బకాశ్రమంబున కరిగె నయ్యెడ బకుం డనుమునీం
ద్రుండు తొల్లి. ౧౬౫

ధృతరాష్ట్రుం డనుధరణీ
పతి దన్ను నధఃకరించి పలికినఁ గోపా
న్వితుఁ డై హోమ మొనర్చెను
ఘృతనరమాంసముల నతనికిం గీ డొదవన్. ౧౬౬

నఱుకఁబడినయడవి తెఱఁగున నతనిరా
ష్ట్రంబు సకలజంతుసముదయములు
నుదియ విన్ననయ్యె నులికి యాభూపతి
యత్తపస్విపాలి కరుగుదెంచి. ౧౬౭

దండప్రణామం బాచరించి పెక్కుభంగులఁ దేలించి మున్ను ధేనునిమిత్తంబగు దుర్భాషణంబుల నింత పుట్టుటం జేసి యాసంయమికి ననేకధేనువుల నొసంగి దురితోపశాంతి యొనర్చె నట్టిబకాశ్రమంబుననుండి రేవతీరమణుండు యయాతంబునకుం బోయె నందు యయాతియజ్ఞంబున భోజనసమయంబున ఘృతదుగ్ధాదులయందు విప్రుం డెయ్యది గోరిన నది యెల్ల సరస్వతి సంపూర్ణమనోరథంబు గా నొసంగుచు వచ్చె నయ్యెడ గదలి వసిష్ఠాపగాహంబునకు వచ్చెఁ దత్ప్రదేశంబు దొల్లి విశ్వామిత్రునాశ్రమం బతండు వసిష్ఠునెడఁ దపోవిషయమత్సరంబునఁ గుపితుం డై. ౧౬౮

అతని వధించుటకై సరస్వతి మదిఁ
దలఁచిన నానది తత్క్షణంబ
సౌమ్యవేషంబునఁ జనుదెంచి నిభృత యై
వని యేమి యనిన నమ్మౌని వసిష్ఠుఁ

గొనిరమ్మా నాకడ కని పంచెఁ బంచిన
వార లిద్దఱుతపోవైభవంబు
నకు భయ మందుచు నరనాథ యరిగి వ
శిష్ఠున కప్పని సెప్పెఁ దెలియ
నాతఁ డవ్వాహినికి నిట్టు లనియె నన్ను
నీవు గొనిపోక తక్కిన నీకు శాప
మిచ్చు నగ్గాధిసుతుఁడు దదిచ్ఛ సలుపు
మించుకేనియుఁ గొంకక యెప్పుడైన. ౧౬౯

అని యనుజ్ఞ యిచ్చిన సరస్వతి యత్తపస్వి తనచేరువ నొకప్పుడు జపయుక్తుండై యుండఁ గూలాపహారణంబు సేసి వఱుత నమ్మహాత్ముం గొనిపోయిన నతం డాంగిరసమంత్రంబుల నత్తరంగిణిం బ్రణుతించె నదియు సంప్రీత యగుచు నమ్మునిని విశ్వామిత్రునకు సన్నిహితుం జేసిన నతని నగ్గాధిసూనుండు వధియింప సాధనం బన్వేషించునాలోన వంచించి యాప్రవాహం బవ్వసిష్ఠుఁ దొలంగించినఁ గోపించి విశ్వామిత్రుండు శోణితవాహిని వగు మని శపించిన నొక్కసంవత్సరం బత్తటిని దైత్యసేవిత యై యుండె నత్తీర్థంబునకుఁ గొందఱు మును లేతెంచి యాదురవస్థ యాలోకించి. ౧౭౦

అమ్మహానది నడిగి వారత్తెఱంగు
దెలిసి నిజయత్నబలమునఁ దీర్పఁ దీఱె
నట్టిదురవస్థ వారలు నాత్మఁ బ్రీతి
యూనఁ జలిపిరి పావనస్నానవిధులు. ౧౭౧

అప్పుడు గొందఱు బ్రహ్మరాక్షసు లమ్మునులకుఁ బ్రణమిల్లి తము చేసినవిప్రద్వేషగురుజనావమానదుష్టాన్నభక్షణంబు లగు పాతకంబులు వేఱువేఱ యుపన్యసించి యే మియ్యెడ వసియించి యున్నవారము మాకు నిష్కృతి యనుగ్రహింపవలయు ననుటయు వారలాపనికి సరస్వతిం బ్రార్థించిన నమ్మహానది యరుణానదివలన నట్టితెఱం గగు టెఱుంగుం గావున నిగూఢంబుగా నరుణం దనలోనికిఁ దెచ్చి దీన మజ్జనంబు సేయుఁ డని యనుమతి సేసిన. ౧౭౨

అజ్జలమునఁ గ్రుంకి యాబ్రహ్మరాక్షసుల్
తనువు లచట విడిచి ధర్మపరుల
గతికిఁ బోయి రట్టు లతిగూఢ మై యున్న
యరుణ తెఱఁ గెఱింగి యమరపతియు. ౧౭౩

తాను సఖ్యంబు సేసి నమ్మించి నముచిఁ జంపినపాపంబు తదీయస్నానంబునం బాపికొనియె నట్టిపుణ్యస్థానంబునుండి యత్తాలధ్వజుండు సామతీర్థంబునకుం జనియె నది సోముండు రాజసూయంబు చేసినచో టయ్యెడ ననిమిషులు షణ్ముఖునకు నిర్జరసేనాధిపత్యంబునకు నభిషేకంబు సేసి రతండు తారకాదు లైనయసురులం దెగటార్చె నతనిజననాదివృత్తాంతంబు కౌరవవంశజాతుండ వగునీకు వినఁ దగుఁ జెప్పెద నాకర్ణింపుము. ౧౭౪

కుమారస్వామిప్రభావాభివర్ణనము

హరుఁడు దనదువీర్య మగ్నియం దిడిన వ
హింపఁజాల కజున కెఱుఁగఁ జెప్పి

యతఁడు వసువ దాని నగ్ని గంగాగర్భ
భూతముగ నొనర్చె భూపవర్య. ౧౭౫

తేజోమయం బైనయాగర్భంబు గంగ హిమవన్నగంబుమీఁద సముత్సృష్టంబు సేసినఁ గనకమయం బైనశరస్తంబంబున నగ్నిసన్నిభుం డగుకుమారుం డై యొప్పె నయ్యెడ మెలంగు కృత్తిక లక్కుమారుం గని పుత్రార్థిను లై యందఱు నొక్క పెట్ట వీఁడు మాకొడు కని పలుకుచుఁ గరతలంబులు నెత్త నప్పు డయ్యార్వురచన్నులుం జేఁపిన నద్దారకుండు చంద్రనిభంబు లైనయాననంబు లాఱు దాల్చి సప్తమాతృస్తన్యపానం బాచరించిన విస్మయప్రమోదభరిత లై వారలాశిశువు నెప్పటియెడన యునిచి రట్లయ్యగ్నిభవుండు గాంగేయుండును శరజన్ముండును గార్తికేయుండును నయ్యె నయ్యెడకు బృహస్పతి యేతెంచి జాతకర్మాద్యనుష్ఠానంబుల నిర్వర్తించి పోయెఁ దత్ప్రదేశంబు దనమహానుభావంబున జాతరూపమయం బై యుండు. ౧౭౬

విను మక్కుమారుఁ డుత్తమ
మనఁ దగ యొదుతపము దనవిహారముగా వ
ర్ధన మొందె ధాత్రి ధాత్రిగ
ధనురాగమమును శ్రుతులును దనుఁ గొలువంగన్.

ఒక్కనాఁ డక్కుమారుం జూచువేడుక శివుండు శైలకన్యకయుం దానుఁ బ్రకృష్టబలపరాక్రమంబులు నానాప్రకారవదన శరీరంబులు గలుగుప్రమథగణంబు గొలువ నయ్యెడకుఁ జను దెంచె నప్పుడు బ్రహ్మవిష్ణులును నింద్రాది దిక్పాలురును

రుద్రాదిత్యమరుద్వసుప్రభృతిసకలసురలును గరుడగంధర్వ కిన్నరకింపురుషసిద్ధవిద్యాధరయక్షాదిదివ్యులును మునులును మఱియుఁ బితృదేవతలును ననుచరసమేతులై యేతెంచిరి మూర్తిమంతంబులై యోషధిసరిత్సముద్రపర్వతంబులు నరుదెంచి నిట్లు నిజదర్శనకౌతుకంబున వచ్చిన యమ్మహాసమూహంబున కభిముఖుండై యోగబలాన్వితుం డగునబ్బాలుండు రా నన్నీలగ్రీవుండు నిరీక్షించి యంతర్గతంబున. ౧౭౮

ఉమయు నగ్నియు గంగయు నుండ నన్ను
గారవంబున నటకునిఁగాఁ దలంచి
చక్క నాపాలి కేతెంచునొక్క పేఁడు
సంభృతస్నేహభక్తివిస్రంభుఁ డగుచు. ౧౭౯

అనుచుండఁగ నమ్మువ్వురు
తనతనచిత్తమున నట్ల తలఁపగ నది యె
ల్లను దివ్యబోధమునఁ గని
కొని యబ్బాలుండు యోగకుశలత వెలయన్. ౧౮౦

మూర్తిచతుష్టయంబు దాల్చి యన్నలువురయొద్దకు నేకకాలంబున జనినం గని యెల్లవారు నద్భుతమగ్నమానసులై రక్కుమారుండు పదంపడి యొక్కరుండై పొలిచి నిలిచె నప్పుడు. ౧౮౧

హరుఁడును గంగయుఁ శిఖియు నంబికయుం బ్రణిపాతపూర్వనిర్భరవినయంబుతోడఁ దగఁ బద్మజుఁ జేరి మహాత్మ యిక్కుమా

రుచిరమూర్తికిఁ గుణగురుత్వవిభూతికి నీవు గాఁగ ని
మ్మరసి యుదాత్తమైనపద మన్న నతండు ప్రియం బెలర్పఁగన్.
దేవహితపరుం డగుటం జేసి చిత్తంబునఁ దలపోసి వీఁడు దేవ
సేనకుం బతి యగుంగాక యని నిశ్చయించి వారల వీక్షించి
యవ్విధ మెల్లవారును వినం దెలియం బలికి శక్రవరుణాదు
లగు మేటివేల్పుల నబ్బాలునకుం జూపి వీరునీకు రక్షణీయు
లని యప్పగించె నయ్యమరవరు లక్కుమారు నభిషేకంబు
సేయుద మని వారిజాసనుం బురస్కరించుకొని యెల్లవారును
దోడన యరుగుదేర సరస్వతీసమీపంబునకుం జని సకలరత్న
మయం బైనదివ్యపీఠంబు హిమవంతుండు వెట్ట నందాభూత
పతిపుత్రు నునిచి బృహస్పతి హోమకార్యంబు నిర్వర్తింప
నీశానవిష్ణువిధి కౌశికులు లోనుగా నమరముఖ్యు లభిషేకద్ర
వ్యంబులు సారస్వతజలపూర్ణమణికనకకలశంబులు ధరియించి
గంధర్వాప్సరోగణంబులు సంగీతమంగళం బాచరింప మహా
మునిప్రకర పుణ్యాహ ఘోషంబులు సెలంగ నుమాశ్రీసర
స్వతీశచీప్రముఖ లైనపుణ్యాంగనలు దీవనలతో సేస లొలుక
నభిషేకించి సమ్మోదంబున సేనాధిపత్యంబునకుం బట్టంబు గట్టి
తొలి తత్ప్రదేశంబున దేవతలు జలాధిపత్యంబునకు వరుణు
నభిషిక్తుం జేసి రవ్వరుణాభిషేకంబుకంటెఁ గుమారాభిషేకం
బొప్పె నప్పావకసంభవునకుఁ గామదమనకమలభవశార్ఙ్గిశత
మఖప్రముఖు లగుసకలప్రభువులు దమతమ యనుచరులయందు
రూపగుణబలపరాక్రమాధికు లైన వారి నేటి భీమఘంటాకర్ణ
సంక్రమదండధరసహితు లగుననేకవీరుల నొసంగి వారల బెరసి

వర్తించుటకుఁ దగిన సేనాంగసముదయంబు నమ్మహాత్మున కు మూలబలంబుగా నొసర్చి రబ్బలంబులఁ జిత్రాభరణ వస్త్రాయుధధరులును వివిధప్రకారాకారులు నగుగజకర్ణనికుంభ కుముదాదు లైన సైనికులు మెఱసి యుల్లసిల్లి రమ్మాతృకలతో శత్రుభయంకరంబు లగుచు మాతృకాగణంబులు ప్రభాసినీవి శాలాక్షీపాలితాపురస్సరంబు లై పొలిచె నట్టియెడ. ౧౮౩

శంకరుఁ డుదితభాస్కరనిభధ్వజమును
వాసవుఁ డసురవిధ్వంసకరణ
పరిణతశక్తియు హరి బలవర్ధని
యగువనమాలయు నగజ యెపుడు
మాయనివెలిపట్టుదోయిని గంగ యు
జ్జ్వలసుధామయకమండలువు గురుఁడు
దీప్తదండము వైనతేయుండు మహితమ
యూరంబు వరుణుం డుదారరూప

మైనతామ్రచూడంబును నర్థవిభుఁడు
దర్పితచ్ఛాగమును శతదళభవుండు
లసితకృష్ణాజినంబును నసమసమర
జయము నొసఁగిరి ప్రీతి నాషణ్ముఖునకు. ౧౮౪

ఇట్లు సిద్ధస్వరూపదీపితుం డై నయాతని నాపోవక చూచుచు శంకరుండు వీని కీవిభవంబునకు ననాయాసంబున నమరవిరోధి నాశంబు గావించుటకు వలయు నని తలంచి భూతమయం బగు మహాసైన్యంబు సమర్పించె నప్పు డింద్రాదిబృందారకులు నిజ

బలసందోహంబులతో నాబర్హివాహనుఁ బరివేష్టించిరి శంఖ
భేరీపణవగోముఖప్రముఖతూర్యంబులుదిక్కులుపిక్కటిల్లఁజెలం
గెసట్లు మహాతి యగు దేవసేనకుఁ బతియై యమ్మహాసేనుండు
సురముఖ్యులఁ జూచి మీకెవ్వరినేనియుం జంపను జెఱుపను
వలసియున్నది యట్టిబల్లిదంపుఁబగఱం బరిమార్చెదనని వరం
బిచ్చిన వారలు బహుప్రమోదంబు నొందిరి సేనయార్చినఁ
ద్రిలోకంబులు నాదమయంబు లయ్యె నవ్విధంబున విశాఖుని
నుత్తమపదస్థునిఁ గావించి విరించి వైకుంఠశ్రీకంఠులు నిజేచ్ఛఁ
జనిరి వదంపడి యగ్గుహుండు దేవతలు దారకాసురునివలన
నలంగి యునికి యెఱింగి. ౧౯౬

బలయుతముగ నడచిన న
బ్బలియుండు ననేకదైత్యబలములతో న
గ్గలిక నెదురు నడచెను ద
ద్బలయుగమున కక్కజంపుభండన మయ్యెన్. ౧౯౭

కుమారస్వామి తారకాసురుం జంపి దేవతలకు ముదంబు సేయుట

అట్టియెడ. ౧౯౮
తనవారలుఁ దాను దారక
దనుజేంద్రుఁడు గార్తికేయుఁ దాఁకిన నమృతా
శనగణసమ్మదసంపా
దనుఁ డగుచును శక్తి యతఁడు ధరియించె నృపా. ౧౯౯

అమ్మహానీయసాధనంబున ననేకకోటిశక్తు లుద్భవించి నానా
దానవపరికరంబుల బడలువడం జేసి యుల్కాసహస్రంబుల

పిడుగులతండంబుల మ్రోఁతచందంబున విరావం బావహిల్ల నది ప్రయోగించి యమ్మహాత్ముండు మహిషత్రిపాదభృత్యో దరు లను దనుజసేనాపతులం బొలియింప నిలింపసైన్యం బులు సంరంభంబున దైత్యబలంబులం దెగటార్చె నక్కు మారుండు ప్రయోగింప నాశక్తిపగతురం బిలుకుమార్చి క్రమ్మఱఁ గరతలంబునకు వచ్చుచుండె నత్తారకుం డట్లు దమవారు సమసిన సక్రోధుం డై యగ్గుహునిఁ గిట్టి బెట్టి దం బగునతని శక్త్యస్త్రంబులతాఁకునం బడియె నిట్లు జయం బు సేకొని యక్కార్తికేయుండు వెలింగె విబుధులు ప్రమో దంబు నొందిరి పదంపడి. ౧౪౯

బలికొండుకు బాణుఁ డనియెడు
బలవదసురవల్లభుండు బాధించు నము
ర్త్యులఁ గ్రౌంచపర్వతాశ్రయు
బలిష్ఠుఁ డయి జగము లెల్ల భయమునుం బొ దన్. ౧౫౦

దాని విని యమ్మహాసేనుండు. ౧౫౧

కడిమిం బోయి మహోగ్రశక్తినిహతిం గ్రౌంచంబు భేదించి యె క్కుడుగర్వంబునవచ్చి మార్కొనినరక్షోనాథుఁ దత్సైన్యముం గడువేగంబున రూపుమాపి మునిసంఘంబుల్ ప్రశంసింపఁ బె ల్లడరన్ నిర్జరదుందుభిధ్వనులు పుష్పాసార మొప్పారఁగన్.

త్రిభువనానందకరుం డై విజయవిభవాతిశయంబున నొప్పె ని ట్లఖిలలోక సంభావనీయం బగుషణ్ముఖచరితంబు లాక ర్ణించి కృతార్థుండ వైతి కౌరవాన్వయపావన యాబలదేవు

వృత్తాంతంబుకో అంత విను మతం డత్తీర్థంబునఁ బ్రతిష్ఠితుం డైనకుమారునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి యం దలి పెద్దలు కుమారాభిషేకంబు సెప్పఁ జెవ్వులపండువు సేసి.

అగ్నితీర్థమునకు నరిగె నయ్యెడఁ దొల్లి
యగ్ని డాఁగి యున్న సమరు లచటి
కేఁగుదెంచి కాంచి రిద్ధశమీగర్భ
లీనుఁ డైనయతని మానవేంద్ర. ౧౯౪

భృగుశాపంబునం బ్రాపించుసర్వభక్షకత్వంబునకుఁ జాలక దొలంగిన యగ్నిదేవు నట్లు గని బ్రహ్మాదిదేవత లిమ్మునివచనం బమోఘంబు గావున నీవు సర్వభక్షకుండ వయ్యు మాలో నగ్రపూజ్యుండ వని యొడంబఱిచి నిజస్థానంబులకుం జనునప్పు డత్తీర్థంబు పరమపావనం బని తజ్జలంబులఁ గృతస్నాను లైరి యందుండి యాసీరి కౌబేరతీర్థంబునకుం జనియె నది కుబేరుండు దపంబు సేసి ధనాదిపత్యంబు మొద లైనవరంబులు వడసినచో టయ్యెడ గదలి యతండు. ౧౯౫

ప్రభావతి యనుమునికన్యకమసిమాభివర్ణనము

బదరిపాచననామ పరమతీర్థమునకుఁ
జనియె భరద్వాజతనయ తొల్లి
యచటఁ బ్రభావతి యనునది యింద్రుండు
పతిగాఁగఁ గోరి తపంబు సేయ
నతఁడు వసిష్ఠునాకృతి దాల్చి వచ్చిన
నయ్యింతి యర్ఘ్యపాద్యాదు లిచ్చి

భక్తితోఁ జేరి మత్పాణి శక్రున కిచ్చు
దాన నప్పానిక మానఁ గాని
వలయుపనిఁ బంపుఁ డన్న నవ్వాలయు నమ్మ
హాత్మఁ డది యట్ల యగుఁ గాని యతివ వీనిఁ
బక్వములు సేయు మని కొన్ని బదరిఫలము
లానితంబినిచే నిచ్చి యనుల నుండ. ౧౮౯

అదియును గృతస్నానయుఁ గలితధౌతపరిధానయు నై ప్రొయ్యి నగ్ని రాజఁ బెట్టి యాఫలంబులు జలంబులతోడఁ గూడ నెక్కించి వండుచుండ నవి పాకంబునకు రాకయుండ వెండియుఁ దనసవరించినకాష్ఠంబులు గ్రమంబున నిడి యనలంబు ప్రబలంబు సేయఁ గాష్ఠంబులు సమసెఁ యారేఁగుఁబండ్లు రియు వయ్యెఁ గాష్ఠంబులు గలయెడకుం బోయి తెచ్చునంత కగ్ని యాఱనేని దుష్పాకం బగు నని యామగువ తనకా లింధనంబుగా నిడి పాకంబు సేయఁ గనుంగొని పాకశాసనుం డచ్చెరు వొంది ప్రత్యక్షుం డై శుభాంగి నీదునిష్ఠాతిశయంబునకు మెచ్చితి భవదభిమతం బిచ్చితి నీతనువు విడిచి త్రిదివమ్మునకు రమ్ము సర్వపాపహరం బై యీతీర్థంబు లోకత్రయప్రఖ్యాతం బయ్యెడు మనియె నమ్మహాభాగయు నా సుమనోవిభునకు మనోరమ యై వెలసె నట్టిబదరిపాచనంబు నుండి. ౧౯౦

ఇంద్రతీర్థమునకు నేఁగె నాబలభద్రుఁ
డచట నానాక్రతువు లాచరించి

యనిమిషేశ్వరుండు గనియె శతక్రతుం
డనుప్రసిద్ధితోడ నతులపదము. ౧౯౮

అచ్చోటు గదలి హలాయుధుండు రామతీర్థంబునకుం బో
యెం బలుమాఱు రాజుల నెల్లను బొదిగొని పరశురాముం
డతృప్తుం డై ప్రాయశ్చిత్తంబుగా నయ్యెడఁ గశ్యపునుపద
ర్శనంబున రాజసూయంబులు నశ్వమేధంబులు వాజిపేయం
బులు ననేకంబు లొనర్చి యమ్మునీంద్రునకు దక్షిణ సమ
స్తక్షోణియు నొసంగె నందుండి యయ్యేకకుండలుండు
యామునంబునకుం జనియె నది వరుణుండు రాజసూయం
బులు సేసినపట్టయ్యధ్వరంబునవసానంబున దేవాసురులకు
సకలభూతసంక్షయకరం బగుచున్నసంగరంబు ప్రవర్తించె.

అచటు గదలి యాతఁ డాదిత్యతీర్థసం
సేవనమున కరిగె ధీవిశాల
యందుఁ గ్రతు వొనర్చి యాదిత్యుఁ డుజ్జ్వల
జ్యోతిషాధిపత్యశోభి యయ్యె. ౨౦౦

ద్వైపాయనుండును శుకుండును గృష్ణుండును జైమినియు మఱి
యును దేవలజైగీషవ్యాదు లగునైష్ఠికు లనేకు లయ్యెడ
నద్భుతయోగసిద్ధిం బొందిరి. ౨౦౧

అచటనుండి సారస్వత మనువసిష్ఠ
తీర్థమున కేఁగె నాబలదేవుఁ డధిప
యందుఁ దొల్లి నిష్ఠాతిశయంబుమై ద
ధీచి యనుముని నియమంబు లాచరించె. ౨౦౨

ఆనియమాచరణంబునకు నింద్రుండు శంకించి తద్విఘ్నకరణం బునకు నలంబుసయను నప్సరోవనితం బుత్తెంచినఁ దదీయదర్శ నంబున నమ్మునివీర్యంబు స్ఖలించిన దాని సరస్వతి గర్భంబు గా ధరియించి పుత్త్రుం గాంచి తపస్విజనగోష్ఠి నున్న యత్తపో ధనుకడకుఁ దెచ్చి వీఁడు నీకొడుకు భవత్తేజంబు వృథ వోనీక యేనువహించి కాంచితి వీనిం గైకొను మనిన నతండు వాని నెత్తికొని యాలింగనంబును మూర్ధఘ్రాణంబును జేసి యాస రిద్వర నాలోకించి నీవు బ్రహ్మసరస్సున జనియించితి పుణ్యన దులయందు మేటి వని సంస్తుతించి నీజలంబులం దర్పణంబు సేసిన విశ్వేదేవతలుఁ బితరులు గంధర్వులుఁ దృప్తు లౌదు రని యనుగ్రహించి యిక్ష్వాకుండు నీపేర సారస్వతుం డనం బరఁగుఁ బదంపడి పండ్రెండేం డ్లనావృష్టి యైన నయ్యాపదఁ బొందకుండఁ బెక్కండ్రుమునుల రక్షించి వేదాధ్యయనంబు లు సేయించు మని చెప్పి యొప్పగించిన సరస్వతి ప్రీత యై తనయుం గొని చనియె నాకాలంబున. ౨౦౩

అమరులకు నసురులకుఁ గల
హవము గలిగిన బలవిరోధి యాయుధనికురుం
బము సవరించుమహోద్యో
గమునఁ బ్రవర్తించె వీరకౌతుక మలరన్. ౨౦౪

ఆ ట్లుద్యోగించి. ౨౦౫

జగముల నెందునుం బడయఁ జాల కతండు దధీచియస్థులం
దగియెడునాయుధంబు లగుఁ దత్పరతం జని వేఁడ నాతఁ డి

చ్చు గురుశరాక్షయోజ్జ్వలయశోనిరతుం డని పంపఁగా నిలిం
పగణము వోయి వేఁడిన నృపాలక యిచ్చె నతండు ప్రీతితోన్.

ఇచ్చి యతం డవ్వియల్లోకంబున కరిగె నమరవరుండును దప
స్థాల వజ్రాయుధంబు నొసర్చి పేర్చె నంత నాసారస్వ
తుండు ద్వాదశవార్షికం బగుననావృష్టిదురితంబునఁ దన్నుం
జేరి పిన్న యునతి విద్యావిశేషకలితం బైనగౌరవంబున శిష్య
త్వంబు భజియించినయఱువదివేవురు మునుల సరస్వతీప్రధాన
జనితం బగునన్నంబున రక్షించుచు వేదంబుఁ జదివించె నా
సారస్వతతీర్థంబున నుండి యాసంకర్షణుండు వృద్ధకన్యాశ్రి
మంబునకుం బోయె నయ్యెడ గర్గవంశవర్యుం డగుకుణి యను
తపోధనుండు. ౨౦౭

పరమతపమున నొకకన్యఁ బడసి పెంచి
దివమునకు నేఁగె నది తపస్స్థిరతఁ బూని
పతి వరింపంగ నొల్లక బ్రహ్మచర్య
మున వెలింగి యయ్యాశ్రమమున వసించె. ౨౦౮

అదంపడి యత్యంతవృద్ధ యై పరలోకగమనంబు గోరెనప్పుడు
యదృచ్ఛాసన్నిహితుం డైననారదుం డక్కన్యక కి ట్లనియె.

విను పాణిగ్రహణము సే
యనివనితకుఁ బుణ్యలోక మప్రాప్యము గా
వున నేయుపాయమున నై
నను దగియెడువరు వరింపు నలినదళాక్షీ. ౨౧౦

అనిన నిజతపఃఫలంబునర్ధంబు లంచంబు
గాఁగ నిచ్చి యదియు గాలవాఖ్య
జుని వరించె నతఁడు సుదతితో సమయంబు
పలికికొనియె ధరణిపాలవర్య. ౨౧౧

సమయంబు నేకరాత్రసహవాససమ్మతికలితం బట్లు పాణిగ్రహణసంస్కారవతి యై యావృద్ధకన్యక యైన యోగంబున నారాత్రి మనోహరయావనయుఁ బరమానులేపనమాల్యాంబరభూషణాభిరామయు నమ్యా నమ్మనియుఁ బ్రీతుండై యున్నాతి సంగతి నన్నిశి గడపెఁ బ్రభాతంబున నన్నితంబిని యాతని కిట్లనియె. ౨౧౨

ఒక్కరేయి నీపాల నాయునికి గాఁగఁ
బలికికొన్నార మది సెల్లె నలఘుచరిత
పోయి వచ్చెద నని దివంబునకుఁ బోవ
నుత్సహించె నమ్ముని మది నుమ్మలింప. ౨౧౩

ఇట్లుత్సహించి యత్తీరంబున దేవఋషి పితృతర్పణపరుం డై రెమొక్కనాఁ డుపవసించినవాఁడు పంచాశద్వత్సరపరిపూరణీయం బగు నైష్ఠికబ్రహ్మచర్యఫలంబు వడయుఁ వాఁ డని పలికి తనువు విడిచి దివంబున కరిగెఁ గురువంశోత్తమా యయ్యెడ నారేవతీపతి శల్యుండు రణంబునఁ బాండవులచేత నిహతుం డగుట విని నగుచు నచ్చటికిఁ జేరువ యగుశమంతపంచకంబు నకుం జని యందుల మునులఁ గురుక్షేత్రవిశేషంబు లడిగిన వార లతనికి నది ప్రజాపతియుత్తరవేది యనియును సమస్తదేవ

తలు నందు వరిష్ఠంబు లగుసత్త్రంబు లాచరించి రనియును దానిఁ గురుం డనురాజు దున్నుడం జేసి దానికిఁ గురుక్షేత్రం బనునామంబు గలిగె ననియు నెఱింగించిన నయ్యేకకుండలుం డాభూమీశ్వరుఁ డేమిప్రయోజనంబునకు దున్నె ననుటయు నాతపోధను లి ట్లనిరి. ౨౧౪

కురుక్షేత్రప్రభావాభివర్ణనము

ఇందుఁ బుట్టినజను లెల్లను దుదెఁ ద్రిది
వంబున కరుగంగ వలయు నని మ
నంబునఁ గోరి యన్నరపతి దున్నంగ
నిందుఁడు సనుదెంచి యేల యిచటఁ
దునిమెద వనిన నమ్మనుజాధిపతి తన
కోర్కి సెప్పిన గేలికొనుచుఁ జనియెఁ
బలుమఱు నద్దేవపతి వచ్చి వెండియు
నుల్లసమాడుచు నుండ నతని
నతఁడు నిష్ఠ గుంద కనిశంబు దున్నంగ
వరముఁ బ్రీతి నొసఁగువాఁడు గాఁగ
నమరు లెఱుఁగ నిశ్చయము సేసి యాశక్రుఁ
డచటి కేఁగుదెంచి యతనితోడ. ౨౧౫

ఈపుణ్యక్షేత్రంబున నిరాహారు లై దేహంబు విడిచినవారల కును నిందు సమరంబు సేసి సమ్యక్ప్రకారంబున మృతిఁ బొం దిన సమస్తజంతువులకును సురలోకప్రాప్తి గలిగెడు మని వల్కి నిజస్థానంబునకుం జనియె నట్లు చను చుండి యాశత మఖుఁడు సంభావనాతిశయంబున. ౨౧౬

గాలిఁ గురుక్షేత్రంబున
ధూళి తనువుఁ జెంది నరునిదుష్కర్మములం
దోలి యతనికి ధరిత్రిం
దూలి మధురలీల మైనతులగతి యొసఁగున్. ౨౧౭

అని నిర్దేశించినఁ గురున్నృపాలుండును గృతకృత్యుండై సంతోషించె నని చెప్పుటయు నాప్రలంబవైరి ప్రమోదభరితుం డగుచు నెలంగి యశ్వత్థమధూకామ్రబిల్వాదిభూరుహావాప శోభితం బైననిజపూర్వాశ్రమంబుఁ గనుంగొని యిది యెవ్వరి యాశ్రమం బని యడిగిన నమ్మును లియ్యెడఁ దొల్లి విష్ణుదేవుండు దపంబు సేసినచోటు మఱియు శాండిల్యప్రభృతు లిందు యోగసిద్ధిం బొంది రనిన విని యయ్యాశ్రమంబుఁ గొనియాడి తత్ప్రదేశంబున బహిఃపరివారంబునెల్ల వీడుకొల్పి యొక్క పుణ్యాచలం బెక్కి దానితటంబున సమస్థలంబున మునిజనసహితంబుగ నాసీనుం డయ్యె నాసమయంబున నిచ్చటికి జటామండలకలితుండును గుశచీరచ్ఛాయాసుందరుండును గలహప్రియుండును నగు నారదుండు హేమదండంబును మణికమండలువును గచ్ఛపవీణయుం బొలుపుమిగుల నేతెంచిన నెల్లవారలుం బ్రత్యుత్థానప్రణామంబు లాచరించి సుఖోపవిష్టుం జేసి పరివేష్టించి రాదేవమునిం గొల్చియుండి యబ్బలదేవుండు.

కురువృత్తాంతం బడిగినఁ
గర మేర్పడఁ జెప్పె నతఁడు గాంగేయుండున్
గురుఁడును గర్ణుఁడు శల్యుఁడు
వరుస ననిం దెగుట కౌరవక్షితినాథా. ౨౧౮

మఱియును మృతులైన నృపకుమారాదియోధవీరులం జెప్పి పదునెనిమిదిదివసంబులం జెల్లినసంగరంబు తెఱంగును సంక్షేప రూపంబునం దెలియం బలికి దుర్యోధనసైన్యం బంతయు సమయుటయు నందుం గృపాశ్వత్థామకృతవర్మలు బ్రదికిపోవుటయు నన్నరపాలుం డోడి పాఱి ద్వైపాయనహ్రదంబు సొచ్చి జలంబుల సంస్తంభించి డాఁగుటయు నది పాండవు లెఱింగి సపరివారంబుగం జనుదెంచి యమ్మనుజుం జుట్టుముట్టి బెట్టిదంపుమాటలాడుటయు దానం గనలి యమ్మనుజవరుం డమ్మడువు వెడలి వచ్చుటయు నెఱింగించి బిరుసుమగ లగుపగతుర పెక్కండ్రను పొదివికొని యుండం గురుపతియు నుక్కుదక్కక యున్నవాండద్దండితనంబుం జూచిన మొత్తువీ వని యుగ్గడించి. ౨౨౦

అతనికి భీమసేనునకు నాహవ మయ్యెడు నొంటిమై మహాద్భుతబలశౌర్యధైర్యములం బొల్చుభవత్ప్రియశిష్యులక్ సుశిక్షితులం గనుంగొనం దలంపుచిత్తమునక్ మొలతెంచు నేనం బొమ్మ్రతులగదాకృతోజ్జ్వలవిహార ముదారనిరూఢి నొప్పెడుక్.

అనిన విని యమ్మునీంద్రుని దక్కటిమునులను వీడ్కొని యాచలంబు డిగ్గి యభ్యంతరపరిజనంబుల నిజపురంబున కనిచి యన్నీలాంబరుం డరదంబు సమీపంబునకుం జని సరస్వతి నాలోకించి. ౨౨౧

అరయంగ మేటిపుణ్యనదులందు సరస్వతి సౌఖ్యసంపదల్
నరులకుం గల్గు నిజ్జగమునం బరలోకమునందు నీసరి
ద్వర నొకనాండు సేరినను వాసవముఖ్యసమస్తదేవతా
వరులును నిందు మేల్ వడయ వత్తురు సంసృతి సాలుసిద్ధికిన్.

అనుచుఁ బలుమాఱు చూచుచు నధికభక్తి
మోడ్పుఁగేలు శిరంబున మోపికొనుచుఁ
బుణ్యతమనిజమూర్తి విస్ఫూర్తి మెఱయ
నమ్మురారాతిపూర్వజుఁ డరద మెక్కె. ౨౨౪

అతిత్వరితగమనంబున ద్వైపాయనహ్రదంబునకుఁ జనుదెంచె
నయ్యెడ. ౨౨౫

ధర్మపుత్త్రాదులును సుయోధనుఁడు నతని
గన్న తెఱఁ గాంబికేయుండు విన్న తెఱఁగు
నధిప మును చెప్పినాఁడ నట్లన్న రేంద్ర
కుంజరుఁడు విని యిట్లను సంజయునకు. ౨౨౬

పాండవదుర్యోధనులు ద్వైపాయనహ్రదంబు విడిచి పాలికలనికిఁ బోవుట

బలభద్రుఁడు సనుదెంచిన
నలఘుగదాస్ఫురితభుజసహాయత్వసము
జ్జ్వలుఁ డగుమత్పుత్త్రునకుఁ
దెలివి మిగులకున్న రణము తెఱఁ గెట్లయ్యెన్. ౨౨౭

అనుటయు నతఁ డిట్లను న
జ్జనపతికి హలాయుధుండు సనుదెంచిన నె
మ్మనము దెలివొందె
మూఁపులు, దనరె మొగం బలరె నీదుతనయున కధిపా. ౨౨౮

ఇట్లు ప్రీతుం డై యాతండు ధర్మనందనుం జూచి శమంతపంచ
కంబు ప్రజాపతియుత్తరవేది యనఁ బ్రసిద్ధం బైనపుణ్యస్థలం

